Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 11 • 16-3-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# కోవూరులో ఎవరు గెలిచినా కల్లోలమే!

ఈ పత్రిక పాఠకులకు అందే సరికి కోవూరు ఓటర్లు పోలింగ్ కేంద్రాల ముందు నిలబడి వుంటారు. మన ఓటర్లు మహా తెలివైన వాళ్లు. ఏమీ తెలియనట్లే, ఏదీ పట్టించుకోనట్లే కనపడతారు. కానీ ఓటు మాత్రం ఎంతో ఆలోచనతో, స్థిరమైన అభిప్రాయంతో వేస్తారు. పోలింగ్ కేంద్రం లోపలకు వెళ్లే వరకే కాదు, ఓటు వేసి బయటకు వచ్చిన తర్వాత కూడా తమ మనసులోని అభిప్రాయాన్ని బయటకు చెప్పరు. అంత గుంభనంగా ఓటు పవిత్రతను కాపాడే ప్రజాస్వామిక దేశం ప్రపంచంలో మరొకటి లేదు. అందువల్లనే అమెరికాలో నూటికి నూరు శాతం ఖచ్చితంగా ఫలితాల మీద జోస్యం చెప్పే సర్వే సంస్థలు మన వరకు వచ్చేసరికి బోల్తా

కొరవ 16వ పేజీలో





## ఉచిత లేజర్ వైద్యం... హ్యాపీ డెంటల్ ఆసుపత్రికే సాధ్యం!

- చక్కెర వ్యాధిగ్రస్తులకు శుభవార్త!
- ఉచితంగా లేజర్ దంతవైద్యం మార్చి 15-25 వరకు
- సిరోలేస్ (జర్మనీ), పికాసో (అమెరికా) లేజర్ టెక్నాలజి
- అందరికీ అందుబాటులో లేజర్ దంత వైద్యం

చక్కెర (షుగర్) వ్యాధి... చిగుళ్ల వ్యాధి మధ్య ఎంతో అవినాభావ సంబంధం వుంది. షుగర్ జబ్బు ఉన్న రోగులు తరచూ చిగుళ్ల సంబంధిత సమస్యలతో బాధపడుతుంటారు. గతంలో ఈ జబ్బులకు చికిత్స చేయడం ఎంతో ఇబ్బందిగా వుండేది. ప్రస్తుతం ఎలాంటి నొప్పి లేకుండా చక్కటి చికిత్స అందించేందుకు లేజర్ వైద్యవిధానం వచ్చింది. ... ఇలాంటి వైద్యం ప్రస్తుతం మన **హ్యాపీ డెంటల్** ఆసుపత్రిలో అందుబాటులోకి రావడం మనందరికి గర్వకారణం.

సాధారణ మధుమేహ (షుగర్) వ్యాధిగ్రస్తులలో రక్తనాళాలు పూడుకుపోయి రక్తం ప్రవహించే మార్గం సన్నగా అవుతుంది. దీంతో చిగుళ్లకు రక్త ప్రసరణ సరిగా జరగక పంటి చుట్టూ 'ఇన్ఫెక్షన్'లు వస్తాయి. ఇది వేగంగా ముదిరి తీవ్ర సమస్యగా మారుతుంది. దీనిని నివారించాలంటే 'ఫ్లాప్' సర్జరీ చేయాల్సి వస్తుంది. ఈ సర్జరీలో ఇంజెక్షన్ చేస్తూ, చిగుళ్ల, ఎముకల్లో చెడిపోయిన భాగాన్ని శుభ్రం చేసి అనంతరం కుట్లు వేస్తారు. ఈ చికిత్సా విధానంలో కొంత నొప్పి, బాధ కలుగుతుంది. అంతేగాక గాయం మానేందుకు మందులు కూడా తప్పనిసరిగా వాడాల్సి వుంటుంది.

ఇలాంటి ఇబ్బందులు లేకుండా అత్యాధునిక చికిత్సా విధానాన్ని హ్యాపీ డెంటల్ ఆసుపత్రి అందుబాటులోకి తేవడం హర్షణీయం. ప్రస్తుతం ఈ ఆసుపత్రిలో ఇలాంటి చికిత్స కోసం సిరోలేస్ (జర్మనీ విధానం), పికాసో (అమెరికా) టెక్నాలజీలను ఉపయోగిస్తున్నారు. ఈ విధానంలో రోగికి ఎలాంటి నొప్పి వుండదు. అంతే కాకుండా మందులు కూడా వాడాల్సిన అవసరం లేదు. ఈ లేజర్ చికిత్సలో మొదట రోగికి డిజిటల్ ఎక్స్‌రే సహాయంతో నోటిలోని సూక్ష్మమైన రుగ్మతలను గుర్తిస్తారు. ఆయా భాగాలలోకి లేజర్ కిరణాలను ప్రసరింప చేస్తారు. ఈ లేజర్ కిరణాల వల్ల ఇన్ఫెక్షన్ తగ్గిపోతుంది. సురక్షితమైన ఈ చికిత్సా విధానంలో ఎలాంటి మందులు, ఇంజెక్షన్లు లేకపోవడం గమనార్హం.

ఈ చికిత్సకు అవసరమైన డిజిటల్ స్కానింగ్, లేజర్ పరికరాలు మన హ్యాపీ డెంటల్ ఆస్పత్రిలో వున్నాయి. రూ.20లక్షల వ్యయంతో వీటిని ఏర్పాటు చేశారు. కొత్త లేజర్ చికిత్సా విధానాన్ని అందరికీ అందుబాటులోకి తేవడంతో పాటు అవగాహన కల్పించేందుకు **మార్చి 15 నుంచి 25 వరకు హ్యాపీ డెంటల్ ఆసుపత్రిలో ఉచితంగా లేజర్ చికిత్సా విధానాన్ని నిర్వహించనున్నారు.** అత్యంత వ్యయంతో కూడిన ఈ లేజర్ చికిత్సను ఉచితంగా అందిస్తుండటం రాష్ట్రంలో ఇదే మొదటిసారని పలువురు దంతవైద్యులు అభిప్రాయపడుతున్నారు. చక్కెర వ్యాధిగ్రస్తులు ఈ అవకాశాన్ని వినియోగించుకోవాలని కోరారు.

మరిన్ని వివరాలకు... **హ్యాపీ డెంటల్ హాస్పిటల్, డాక్టర్ రామచంద్రారెడ్డి హాస్పిటల్ ఎదురుగా, బృందావనం, నెల్లూరు. ఫోన్ 2349555, 92464 25550.**



ప్రొఫెసర్ డాక్టర్ శ్రీధర్‌రెడ్డి
ఫిక్స్‌డ్ పళ్ళ స్పెషలిస్ట్

డాక్టర్ ప్రసన్న
దంత వైద్య నిపుణురాలు

కత్తులు లేని చికిత్స - నొప్పి తెలియని వైద్యం **లేజర్ దంత వైద్యం**



# శెబాష్ త్రివేది

రాజకీయాలలో నీతికి, నేతి బీరకాయలో నెయ్యికి పెద్ద తేడా లేదు. వేలాది కోట్ల ప్రజాధనాన్ని దోచుకొని, మొగల్ చక్రవర్తులు కూడా అసూయ చెందే రీతిలో రాజభవంతులు కట్టుకొని, రాచరికపు భోగాలనుభవిస్తూ, తిరిగి అదే ప్రజలకు రాజకీయాలలో విలువల గురించి ఉద్భోదించే వైఎస్. జగన్, మాయావతి వంటి నేతలున్న కాలమిది. కానీ అంతరించి పోయాయనుకొన్న అరుదైన జాతులకు చెందిన అవశేషాలు అప్పుడప్పుడూ అనుకోకుండా బయటపడుతూ వుంటాయి. ఆ కోవకు చెందిన వాడే దినేష్ త్రివేది. కేంద్ర రైల్వే మంత్రిగా ఆయన తన తొలి బడ్జెట్ ప్రవేశపెట్టాడు. అందులో రైలు ప్రయాణ ఛార్జీలు పెంచాడు. ప్రపంచంలోని అతి పెద్ద రైల్వే వ్యవస్థలలో భారతీయ రైల్వే ఒకటి. రోజుకు 3 కోట్ల మంది ఎక్కి దిగే భారీ వ్యవస్థ అది. కానీ దురదృష్టవశాత్తు పరిమాణంలో భారీతనం తప్ప, ప్రమాణాలలో అత్యంత పలుచనగా నడుస్తున్నది. రైలు పెట్టెలు, వాటి లోపల సీట్లు, మరుగుదొడ్లు, వసతులు, ప్లాట్‌ఫారాలు, వాటిపై దొరికే తిండి, నీళ్లు... ఇట్లా దేన్ని చూసినా భారతదేశం పేద దేశమన్న నిజం వ్యక్తమౌతూ వుంటుంది. ఈ దుస్థితి మారాలంటే పెట్టుబడి పెట్టాలి. అందుకు డబ్బు కావాలి. డబ్బనేది గాలిలోంచి వూడి పడదు. చేసే వ్యాపారంలో నుంచే దాన్ని సృష్టించాలి. ఖర్చుకు రాబడికి మధ్య పొంతన సాధించాలి. కానీ గత పదేళ్లుగా రైల్వే మంత్రులుగా వచ్చిన వారందరూ ఫక్తు రాజకీయవాదులు. వారికి తాము నిర్వహించే రైల్వే వ్యవస్థ దివాలా తీసి, భస్మమైపోయినా ఇబ్బంది లేదు. కానీ ఆ బూడిద కుప్ప నుంచి ఓట్లు పుట్టాలి. లల్లూప్రసాద్ యాదవ్, మమతా బెనర్జీ వంటి వారు అందువల్లనే ప్రయాణ ఛార్జీలు పెంచలేదు. ఏడాదికి 10 శాతం ద్రవ్యోల్బణం వున్న దేశం మనది. అంటే ఏటా అంత మేర అన్ని వస్తువుల ధరలూ పెరుగుతాయని అర్థం. డీజిల్, బొగ్గు, విద్యుత్, సిమెంట్, స్టీల్, అన్ని రకాల పరికరాలు, ఉపకరణాలు, యంత్రాల ధరలు ఏటా ద్రవ్యోల్బణం కంటే అధికంగా పెరుగుతూ వస్తున్నాయి. రైల్వే నిర్వహణకు అవన్నీ అవసరం. ప్రయాణ ఛార్జీలు పెంచకుండా రైళ్లు నడపడం ఎట్లా సాధ్యం? అందువల్లనే మన రైళ్లు పేదరికపు ఆనవాళ్లుగా వెలుగొందుతున్నాయి. దాని ఫలితంగా ప్రయాణంలో అసౌకర్యమే కాదు, ప్రయాణికుల భద్రత కూడా గాలిలో దీపంగా మారుతున్నది. సరైన సిగ్నల్ వ్యవస్థ లేక, సకాలానికి పాతబడిన పట్టాలు మార్చక, వంతెనలు కట్టక, చాలినంత మంది నిర్వహణ సిబ్బంది లేక రైళ్లు తరచూ ప్రమాదాలకు గురౌతున్నాయి. వాటిలో ఎంతోమంది ప్రాణాలు కోల్పోతున్నారు. ఈ దుస్థితి తప్పాలంటే రైల్వే వ్యవస్థను ఆధునీకరించాలి. ప్రపంచస్థాయి ప్రమాణాలకు అనుగుణంగా దాన్ని తీర్చి దిద్దాలి. అందుకోసం తన బడ్జెట్‌లో ప్రయాణ ఛార్జీలు పెంచాడు. దినేష్ త్రివేది. ఆయన తృణమూల్ కాంగ్రెస్‌కు చెందిన వాడు. తన పార్టీకి చెందిన మంత్రి రైలు ఛార్జీలు పెంచాడన్న నినాదంతో కమ్యూనిస్టులు పశ్చిమబెంగాల్ ప్రజలను రెచ్చగొడతారని భయపడింది మమతా బెనర్జీ. పెంచిన ఛార్జీలు తగ్గించమని దినేష్ త్రివేదిని ఆదేశించింది. ఆ స్థానంలో మరొకరు వుంటే, ఒక్క క్షణం ఆలోచన లేకుండా ఆమె ఆదేశం పాటిస్తారు. కానీ త్రివేది భిన్నంగా వ్యవహరించాడు. రైల్వే మంత్రిగా తన ప్రథమ బాధ్యత రైల్వే సంక్షేమం కాబట్టి, ఛార్జీలు పెంచకుండా దాన్ని నాశనం చేయడం తప్పని వాదించాడు. ఫలితం ఆయన పదవి వూడింది. ఒక్క గంట కూడా వ్యవధి ఇవ్వకుండా మమతా బెనర్జీ ఆయన్ను తొలగించమని ప్రధానిని కోరింది. కానీ త్రివేది లెక్క చేయలేదు. దేశం కోసం ప్రాణాలను తృణప్రాయంగా వదలిన భగత్‌సింగ్ పుట్టిన దేశమిది. విలువల కోసం పదవి వదులుకోవడం పెద్ద త్యాగం కాదు అని ప్రకటించాడు త్రివేది.

మన రాష్ట్రంలో ఆరుగురు మంత్రులకు సుప్రీంకోర్టు అవినీతి ఆరోపణలపై నోటీసులు ఇచ్చింది. ఏసిబి కోర్టు ఒక మంత్రిమీద ఏకంగా కేసు పెట్టింది. సిబిఐ ఇప్పటికి ఇద్దరు మంత్రులను దోషులుగా పిలిచి విచారణ జరిపింది. కానీ వారిలో ఏ ఒక్కరూ తమ పదవులను వీడలేదు. మంత్రులుగా వుంటూనే నేరస్తులుగా కోర్టు బోను ఎక్కి వాదనలు విన్పిస్తున్నారు. అటువంటి గంజాయి వనంలో దినేష్ త్రివేది వంటి తులసి మొక్క ఇంకా బ్రతికి వుందన్న నిజం మనసుకు ఎంతో వూరట కల్గిస్తున్నది. తనకు ప్రమేయంలేని రైలు ప్రమాదానికి నైతిక బాధ్యత వహించి రైల్వే మంత్రి పదవికి రాజీనామా చేసిన లాల్‌బహదూర్ శాస్త్రి సరసన దినేష్ త్రివేది పేరు చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతుంది. పదవి కంటే ఆ ప్రజాభిమానమే ఎక్కువనే నిజాన్ని మన దౌర్భాగ్యపు రాజకీయవాదులు ఎప్పటికి గ్రహిస్తారో?

జమీన్‌రైతు

## జనవాణి

### చట్టసభల్లో రిజర్వేషన్ కోసం పోరాడాలి!

మహిళలు ఐక్యతతోనే సాధికారత సాధించాలి. అన్ని రంగాల్లో మహిళలు ముందడుగు వేయాలి. రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాల్లో మహిళలు ఎదగాలి. చట్టసభల్లో మహిళలకు 50 శాతం రిజర్వేషన్ల కోసం పోరాడాలి. మహిళల ప్రగతికి ప్రతిబంధకంగా తయారైన మద్యం మహమ్మారిని తరిమి కొట్టాలి. బెల్టుషాపులు లేకుండా చేయాలి. భ్రూణ హత్యలను నిరోధించడంలో మహిళలు ముందుకు రావాలి. మహిళలపై పెరుగుతున్న అరాచకాలు, అత్యాచారాలపై ప్రతి మహిళా స్పందించి తమ గళం విప్పాలి. ఈయేడు జరుపుకొన్న అంతర్జాతీయ మహిళా దినోత్సవం అందరికీ ప్రతిజ్ఞాదినోత్సవం కావాలి.

*పందిళ్లపల్లి అరుణమ్మ* — నెల్లూరు

### ఆనమోళ్లకు కృతజ్ఞత ఏది?

ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి అసెంబ్లీలో వైఎస్ విజయమ్మపై చేసిన అనుచిత వ్యాఖ్యలు ఆనం వారి కృతజ్ఞతలేని భావాన్ని చాటాయి. స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఆనం కుటుంబ రాజకీయ ఎదుగుదలకు ఎంతో సహకరించారు. ఒకే కుటుంబంలో ఇద్దరు వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డిలకు పార్టీ టిక్కెట్లు ఇప్పించిందేగాక రామనారాయణరెడ్డిని మంత్రిని చేశారు. అటువంటి కుటుంబం గూర్చి అసెంబ్లీలో రామనారాయణరెడ్డి ఎగెసెక్కంగా మాట్లాడడం ప్రజలు గమనిస్తూనే ఉన్నారు. వీరికి ఏదో రోజు తగిన గుణపాఠం చెబుతారు.

*బి.ఆర్.శాలి* — కావలి

### అక్రమ నిర్మాణాలు - చర్యలు!

నిబంధనలకు విరుద్ధంగా కట్టిన భవనాలను క్రమబద్ధీకరించుకోమని మునిసిపల్ పరిపాలన మరియు పట్టణాభివృద్ధి శాఖ 2008 సంవత్సరంలో ఉత్తర్వులు జారీచేసింది. దీని ప్రకారం విస్తీర్ణం, రిజిస్ట్రేషన్ విలువల ఆధారంగా అపరాధరుసుం లెక్కింపబడుతుందని, దీన్ని రెండు విడతల్లో చెల్లించవచ్చునంది. 1997 ముందు నిర్మించిన భవనాలకు అపరాధరుసుంలో 25 శాతం రాయితీ, మురికివాడల్లో ఉన్న ఇళ్లకు 50 శాతం రాయితీ ఇచ్చింది. 2007 తర్వాత ప్లాన్ లేకుండా కట్టిన భవనాలు కూల్చివేయమంది. ఈ పథకంలో భాగంగా ఎవరు క్రమబద్ధీకరించుకొన్నారో, ఎవరు ఈ పనిచేయలేదో తెలియడం లేదు. ఈ వ్యవహారంలో ప్రభుత్వ ఉత్తర్వులకు అనుగుణంగా నడుచుకోవాల్సిన బాధ్యత కార్పొరేషన్ అధికారులకు లేదా?

*ఆలూరి ఆత్మానందం* — నెల్లూరు

### మానవత్వంతో ఆదుకోండి!

నెల్లూరు రెడ్‌క్రాస్ బ్లడ్‌బ్యాంకులో రక్తంకొని ఎక్కించుకొన్న వెంకటేశ్వర

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**20-3-1942**
**పేజీలు : 8 వెల: అణా**

### రంగా గారి సభ

14వ తేది సాయంత్రం నెల్లూరులో తిప్పరాజు వారి సత్రం వద్ద జిల్లా రైతు సంఘ యాజమాన్యమున బహిరంగ సభ జరిగినది. ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘ కార్యదర్శి చేగిరెడ్డి బాలిరెడ్డి గారు అధ్యక్షత వహించిరి. ఆచార్య రంగాగారు జైలు జీవితాన్ని గూర్చి, ప్రస్తుత రాజకీయములను గూర్చి ఉపన్యసించిరి.

### నెల్లూరు గలాటా

17వ తేది కాల్పుల సందర్భంలో ఆసుపత్రిలోనున్న ఐదుగురిలో ముగ్గురు ప్రమాదస్థితిలోనున్నారు. ఇద్దరికి పరవాలేదు.

***

బజారుకు పడమరగా ఉండే దాడివారివీధి మున్నగు వీధులలో హిందువులు లేని యిండ్లు ఖాళీ ఉండగా, పూనిటివ్ పోలీస్ అదనంగా వచ్చిన సందర్భంగా పోలీసులకు యిండ్లు కావలసిరాగా సదరు వీధులలో హిందువులు ఖాళీచేసి యిండ్లు ఇచ్చారు. 17వ తేది గలాటానాడు భాషికాలవీధిలో కాపురముండే నాలుగు పోలీసు యిండ్లపై రాళ్లుబడినవనియు, ఆ కారణంగా ఆ యిండ్లు ఖాళీజేసినారని తెలుస్తున్నది. పోలీసులే భయపడితే ఇక పౌరులెట్లు కాపురం చేయగలరండీ! పోలీసు పైఅధికారులు తిరుగా ఆ కుటుంబాలను అక్కడ చేర్చి రౌడీయిజం జరక్కుండా బందోబస్తు చేయాలి.

### గూడూరు

జీవద్యరక్షిణి గ్రంథకర్త గారైన దివంగత జి.రంగయ్యనాయుడి గారి జ్ఞాపకార్థం గ్రిద్దలూరి వెంకటాచలపతి నాయుడు గారు పబ్లిక్ ఉపయోగమునకు గూడూరు బోర్డు లైబ్రరీకి ధర్మముగా తన వద్దనున్న అనేక తెలుగు గ్రంథములనిచ్చిరి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**16-3-1962**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### నెల్లూరు ముచ్చట్లు

#### అభినందనలు

ఇరవై ఒక్క మాసాల పన్నెండు రోజుల అనంతరం తిరుగా మంత్రి అయిన ఏ.సి సుబ్బారెడ్డి గారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము. ఆనాటికంటే ఈనాడు సుబ్బారెడ్డి ప్రధానము, ప్రజోపయోగకరమైన నీటి వనరులు, విద్యుచ్ఛక్తి శాఖలకు అధిపతి గావడం విశేషం. ఈ శాఖల ద్వారా సుబ్బారెడ్డి రాష్ట్రానికి, ముఖ్యంగా జిల్లాకు అత్యంతంగా సేవజేసే అవకాశమున్నది. అంతేగాదు తన సహజ ప్రజాసాన్నిహిత్యాన్ని మరింత పెంపొందించుకొని, తన నాయకత్వాన్ని రాష్ట్రవ్యాపితం జేసుకొనే అవకాశం గూడా ఉంటుంది.

#### ఏ.సికి స్వాగతం

ఈ రోజు ఎక్స్‌ప్రెస్‌లో తిరుపతికి పోతుండిన మంత్రి ఏ.సి సుబ్బారెడ్డి గారికి, నెల్లూరులో దాదాపు వెయ్యి మందికి పైగా చేరిన వారి అభిమానులు హర్షధ్వానాలతో స్వాగతమిచ్చారు. వందలాది పుష్పహారాలు వారి కంఠాన్ని అలంకరించాయి. సుబ్బారెడ్డి రైలు దిగి ప్లాట్‌ఫారం మీదకు వచ్చి తన అభిమానులకు అభివాదములు చెప్పారు. ఈ ఆనందకోలాహలంలో ఎక్స్‌ప్రెస్ గూడా టైంకు కదలడం మరచిపోయి, అట్లనే ఇరవై నిముషాల సేపు ఆగింది.

#### జిల్లా పరిషత్తు

తాత్కాలిక ఛైర్మన్‌గా నల్లపరెడ్డి చంద్రశేఖర్‌రెడ్డి గారు వ్యవహరిస్తున్నారు. తిరుగా ఛైర్మన్ ఎన్నిక జరిగే వరకు ఆ బాధ్యతలను వీరే నిర్వర్తించగలరు. ఛైర్మన్ ఎన్నికతేది నిర్ణయం కాలేదు. క్రొత్త శాసనసభ్యులు ప్రమాణ స్వీకారం చేసిన అనంతరం నిర్ణయం కావచ్చు. ఏమైనా ఇక ఈ నెలలో ఉండకపోవచ్చు.

# నెల్లూరు ముచ్చట్లు

## 16 గంటల కోతకు రంగం సిద్ధం!

ఏప్రెల్ నెల నుంచి విద్యుత్ కోతలు తీవ్రమవనున్నాయి. గ్రామాల్లో రోజుకు 16 గంటలు, మండల కేంద్రాల్లో 12 గంటలు, మునిసిపాలిటీల్లో 10 గంటలు, నగరాల్లో ఎనిమిది గంటల విద్యుత్‌కోతకు అధికారులు రంగం సిద్ధం చేస్తున్నారు. నగరాల్లో సైతం పగటి వేళలతోపాటు పొద్దుపొయ్యాక విద్యుత్ కోతలుండేలా ప్రణాళికను రూపొందించినట్లు విశ్వసనీయవర్గాల ద్వారా తెలిసింది.

## రానిది కెసిఆర్... బాలకృష్ణే!

కోవూరు ఉప ఎన్నికలను పురస్కరించుకొని ప్రచారానికి అన్ని పార్టీల అగ్రనేతలు తరలివచ్చారు. తెలుగుదేశం పార్టీ తరపున చంద్రబాబునాయుడు మూడుసార్లు, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధినేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ఏకంగా ఆరు రోజులు ప్రచారం చేశారు. కాంగ్రెస్ పార్టీ తరపున ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి, పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్యనారాయణ, పిసిసి మాజీ అధ్యక్షుడు డి.శ్రీనివాస్, మెగాస్టార్ చిరంజీవి వచ్చి ప్రచారం చేశారు. సినీ నటులు రోజా, బాబుమోహన్ ప్రచారం కూడా కొనసాగింది. కోవూరుకు వచ్చి ఆంధ్రరాష్ట్ర ప్రజాసమితి అభ్యర్థి తరపున ప్రచారం చేస్తానన్న తెలంగాణ రాష్ట్ర సమితి అధ్యక్షుడు టి.చంద్రశేఖరరావు ప్రచారానికి రాలేదు. నటుడు బాలకృష్ణ సినిమా షూటింగుల బిజీతో తెలుగుదేశం అభ్యర్థి తరపున ప్రచారం చేయను నెల్లూరుకు రాలేకపోయినట్లు ఆ పార్టీ వర్గాలు చెప్పాయి.

## రికార్డు డ్యాన్సులపై రచ్చ!

కోవూరు ఉపఎన్నికల సందర్భంగా నార్తురాజుపాళెంలో సిఎం కిరణ్‌కుమార్ రెడ్డి పాల్గొన్న సభలో రికార్డు డ్యాన్సులు ఏర్పాటుచేసిన విషయమై రచ్చ జరుగుతోంది. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రి హోదాలో రాచర్లపాడు దగ్గర ఇఫ్కో కిసాన్ సెజ్ శంకుస్థాపనకు విచ్చేసినప్పుడు రాజుపాళెం సభ తరహాలోనూ రికార్డు డ్యాన్సులు ఏర్పాటు చేశారు. కానీ ఒక్క నేత, అధికారి ఈ వ్యవహారమై మాట్లాడలేదు. ఇప్పుడేమో ఈ వ్యవహారమై కేంద్ర ఎన్నికల సంఘానికి ఫిర్యాదు చేశారు. రికార్డు డ్యాన్సులను విచారించే స్థాయికి ఎన్నికల కమిషన్ దిగిపోవడం పట్ల పలువురు ప్రజాస్వామ్య వాదులు విచారం వ్యక్తం చేస్తున్నారు.



## నెల్లూరులో నిద్రచేసిన సిఎం!

9వ తేది ఉప ఎన్నికల ప్రచార నిమిత్తం నెల్లూరుకు హెలికాప్టర్‌లో వచ్చిన ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి నార్తురాజుపాళెంలో జరిగిన బహిరంగ సభలో ప్రసంగించిన అనంతరం ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఇంటికి వెళ్లి విందు చేశారు. కోవూరు నియోజకవర్గ పరిధిలోని మండల స్థాయి నేతలతో రాజకీయ చర్చలు జరిపిన అనంతరం నెల్లూరు చెరువు సమీపంలోని పినాకినీ అతిథి గృహానికి వెళ్లి నిద్రపోయారు. 10వ తేది ఉదయం నెల్లూరు నుంచి హెలికాప్టర్‌లో బయలుదేరి రేణిగుంట విమానాశ్రయానికి వెళ్లి అక్కడ నుంచి హైదరాబాద్ వెళ్లారు.

## ముఖం చూపించి వెళ్లిన పనబాక!

కోవూరు ఉప ఎన్నికలను పురస్కరించుకొని కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి, తిరుపతి ఎమ్పీ చింతామోహన్‌లను పార్టీ తరపున ఇన్‌ఛార్జీలుగా నియమించారు. కేంద్ర మంత్రి పనబాక లక్ష్మి 9వ తేది సిఎం నార్తురాజుపాళెంలో పాల్గొన్న ప్రచార సభలో ముఖం చూపించి 'మమ' అనిపించారు. విజయవాడ ఎమ్పీ లగడపాటి రాజగోపాల్ రెండు రోజులపాటు నెల్లూరులోనే ఉండి కాంగ్రెస్ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డికి మద్దతుగా కొడవలూరు, విడవలూరుల్లో ప్రచారం చేసి వెళ్లారు.

## వైకాపా ఆవిర్భావ దినోత్సవం!

వైఎస్ఆర్ కాంగ్రెస్ ఆవిర్భావ దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు పొదలకూరురోడ్డులోని ఆ పార్టీ కార్యాలయంలో 12వ తేది పార్టీ జెండాను మాజీ ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి ఎగురవేశారు. అనంతరం వైఎస్ రాజశేఖరరెడ్డి విగ్రహానికి పూలమాలవేసి మాట్లాడారు. వైఎస్ జగన్మోహన్‌రెడ్డి జనం మదిలో సుస్థిరస్థానం సంపాదించుకొన్నారని ఆయన నాయకత్వంలో పని చేయడం గర్వంగా ఉందన్నారు. 2014 ఎన్నికల తర్వాత వైఎస్ జగన్మోహన్‌రెడ్డి ముఖ్యమంత్రి కావడం తథ్యమన్నారు. ఈ కార్యక్రమంలో ఆ పార్టీ నేతలు కొణతాల రామకృష్ణ, నెలవల సుబ్రహ్మణ్యం, బాలకొండయ్య, రూప్‌కుమార్ పాల్గొన్నారు.

## కోవూరు బరిలో 14 మంది!

కోవూరు నియోజకవర్గానికి జరుగుతున్న ఉప ఎన్నికల బరిలో 14 మంది అభ్యర్థులున్నారు. వీరిలో పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి(కాంగ్రెస్), సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి (తెలుగుదేశం), జొన్నలగడ్డ వెంకమరాజు(సిపిఎం), నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి(వైకాపా), కొండపల్లి గురవయ్యసోషలిస్టు కాంగ్రెస్ పార్టీ), కొల్లు మధుబాబు(ఆంధ్ర రాష్ట్ర ప్రజాసమితి), నెల్లూరు నరసయ్య(లోక్‌సత్తా), పాలెపు విజయకుమార్(రాజ్యాధికార పార్టీ), తరపున పోటీచేస్తున్నారు. అద్దెపల్లి చంద్రశేఖర్, పరసు కుమారరాజ, చింతల చిరంజీవి, పట్టపు రవి, మేడా మల్లారెడ్డి, సుక్కిరేణి కోటేశ్వరరావు ఇండిపెండెంట్లుగా రంగంలో ఉన్నారు.

## మహిళల చేతిలో పవర్!

మహిళలు ఎక్కువగా ఏ పార్టీకి ఓటు చేస్తారో ఆ పార్టీ కోవూరులో గెలవడం ఖాయమని చెప్పొచ్చు. నియోజకవర్గంలోని 2,09,626 మంది ఓటర్లు ఉండగా అందులో మహిళలు 1,08,341 మంది, పురుషులు 1,01,285 మంది ఉన్నారు. నియోజకవర్గ పరిధిలోని బుచ్చి మండలంలో 27,063 మంది, కోవూరులో 25,839 మంది, కొడవలూరులో 17,030 మంది, విడవలూరులో 17,621 మంది, ఇందుకూరుపేటలో 29,788 మంది మహిళా ఓటర్లున్నారు. అన్ని మండలాల్లోనూ మహిళల ఓట్లు ఎక్కువగా ఉండడంతో అవి ఎవరికి పడతాయన్న సందిగ్దత అన్ని పార్టీల్లో ఉంది.

## నాల్గవ కృష్ణుడు రావడం ఖాయం!

రాష్ట్రంలో ఉప ఎన్నికల తర్వాత ముఖ్యమంత్రి మార్పు ఖాయమని తెలుగుదేశం పార్టీ సీనియర్ ఎమ్మెల్యే ముద్దు కృష్ణమనాయుడు జోస్యం చెప్పారు. నెల్లూరులో ఆయన విలేకరులతో మాట్లాడుతూ ఇటీవల ఐదు రాష్ట్రాలలో జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ అడ్రస్ గల్లంతయ్యిందన్నారు. 2013లో కేంద్రంలో మధ్యంతర ఎన్నికలు తథ్యమని, ఈ నేపథ్యంలో రాష్ట్రంలో నాల్గవ ముఖ్యమంత్రి రావడం ఖాయమన్నారు.



సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకరరెడ్డి మామ దివంగత రావూరు సుబ్బారెడ్డి జ్ఞాపకార్థం ఆయన కుమార్తె ఆదాల వింధ్యావళమ్మ రావూరువారి కండ్రిగలో నిర్మించిన సీతారామాంజనేయస్వామి దేవస్థానంలో పూజాదికాలు నిర్వహిస్తున్న దృశ్యం.

## ప్యాకేజీల ప్రసన్న

ఏ పార్టీ వారితో ప్యాకేజీ కుదిరితే ఆ పార్టీలోనికి వెళ్లడం నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డికి అలవాటని ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి విమర్శించారు. 11వ తేది నెల్లూరు నగర కాంగ్రెస్ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. కోవూరులో కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల మధ్యే పోటీ జరుగుతుందన్నారు. కాంగ్రెస్ పార్టీని వంచించిన మేకపాటి సోదరులు, తెలుగుదేశం పార్టీని వంచించిన నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డిని ప్రక్కనపెట్టుకొని జగన్మోహన్‌రెడ్డి బహిరంగ సభల్లో వంచన గూర్చి మాట్లాడడం హాస్యాస్పదంగా ఉందన్నారు.

## లక్ష్మీపార్వతి ప్రచారం

ఏ పార్టీ నేతో తెలియదుగానీ నందమూరి లక్ష్మీపార్వతి కోవూరులో వైకాపా పార్టీ తరపున పోటీచేస్తున్న నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డికి మద్దతుగా బుచ్చి, విడవలూరు మండలాల్లో ప్రచారం చేసింది. ఎన్టీఆర్ తర్వాత పేదల గూర్చి పట్టించుకొంది స్వర్గీయ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అని ఆమె పేర్కొన్నారు.

## అద్దె మైకులు

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో రోజా, లక్ష్మీపార్వతి, వాసిరెడ్డి పద్మ, గట్టు రామచంద్రరావు అద్దె మైకులని తెలుగుదేశం పార్టీ శాసనమండలి సభ్యుడు రాజేంద్రప్రసాద్ విమర్శించారు. నెల్లూరులో ఆయన విలేకరులతో మాట్లాడుతూ ఉపాధిహామీ పథకంలో దినకూలీల మాదిరి వాళ్లు మైకుల ముందు ఎంతగా మాట్లాడితే అంత పేమెంట్ ఉంటుందన్నారు. స్వర్గీయ ఎన్టీరామారావు భార్యనని చెప్పుకొనే లక్ష్మీపార్వతి జగన్మోహన్‌రెడ్డి పంచన మనిషైతే చేరుతుందా అని ప్రశ్నించారు.

## సింహపురి హోటల్ వెంకటరెడ్డి వర్ధంతి

నెల్లూరు రైల్వేస్టేషన్ రోడ్డులోని సింహపురి హోటల్ వ్యవస్థాపకుడు సన్నపరెడ్డి వెంకటరెడ్డి 8వ వర్ధంతి కార్యక్రమం 8వ తేది హోటల్ ఆవరణలో జరిగింది. వెంకటరెడ్డి కుమారుడు సన్నపరెడ్డి శ్రీధర్‌రెడ్డి వెంకటరెడ్డి చిత్రపటానికి పూలమాలవేసి ఘనంగా నివాళులర్పించారు. వెంకటరెడ్డి అన్న కుమారులు సన్నపరెడ్డి సుధాకర్‌రెడ్డి, సన్నపరెడ్డి కృష్ణారెడ్డిలు నివాళులర్పించి ఆయన సేవలను కొనియాడారు. ఈ కార్యక్రమంలో హోటల్ మేనేజర్ విజయకుమార్, హోటల్ సిబ్బంది, వెంకటరెడ్డి అభిమానులు పాల్గొన్నారు.

## ముత్యాలమ్మ జాతర

చిల్లకూరు మండలం తూర్పు కనుపూరు గ్రామంలో వెలసిన ముత్యాలమ్మ జాతర ఈ నెల 20వ తేది నుంచి 23వ తేది వరకు జరుగుతుంది. 20వ తేది పోలేరమ్మ నిలుపుతో జాతర ప్రారంభమవుతుంది. 21వ తేది యార, గురునాధస్వామి, అంకమ్మ దేవతల గ్రామ ఉత్సవం, రాత్రి అమ్మణ్ణి ఉయ్యాలసేవ జరుగుతాయి. 23వ తేది పోలేరమ్మ వెళ్లనంపు ఉత్సవం జరుగుతుంది. జాతర మొదటి రోజు ఏర్పాటయ్యే లయ విన్యాస కచేరిని భక్తిఛానల్‌లో లైవ్ ప్రోగ్రామ్‌గా ప్రసారం చేస్తారని దేవస్థాన ఛైర్మన్ వేమారెడ్డి మురళీమోహన్ రెడ్డి చెప్పారు. నెల్లూరుకు చెందిన కొండూరు ప్రతాప్, లక్ష్మి దంపతులు అమ్మవారికి లక్షా పదహారువేల రూపాయలతో వజ్రపు మంగళ

కొరవ 14వ పేజీలో

# రాజకీయ కూలీలకు గిరాకీ!

## ఉప ఎన్నికలా - మజాకానా?

కోవూరు ఉప ఎన్నికల పుణ్యమా అని జిల్లాలో రాజకీయ కూలీలకు డిమాండ్ ఏర్పడింది. ప్రచార పర్వానికి, ఇంటింటికెళ్లి ఓటర్లను కలుసుకొని ఓటు అభ్యర్థించేందుకు, సభలు, సమావేశాలు జరిగినపుడు వెలితి లేకుండా ఉండేందుకు జనాన్ని తోలడం పరిపాటైంది. దీనికోసం నియోజకవర్గ పరిధి అన్న ఆంక్షలు లేకుండా జిల్లావ్యాప్తంగా వివిధ ప్రాంతాల నుంచి జనాన్ని రోజుకూలీ చెల్లించి వాహనాలలో తీసుకొని రావడం ఇటీవల కాలంలో అధికమయ్యింది. మహిళలకు వంద నుంచి రెండొందల రూపాయలు, పురుషులకు డబ్బుతోపాటు మద్యం బాటిళ్ల పంపిణీ అదనం. ఇక తిండి సంగతి సరేసరి. ఈ ఎన్నికలను అధికార కాంగ్రెస్ పార్టీతోపాటు తెలుగుదేశం, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలు ప్రతిష్టాత్మకంగా తీసుకోవడంతో ప్రచార కార్యక్రమాల్లో చిత్రవిచిత్రాలు చోటుచేసుకొంటున్నాయి. గతంలో అభిమానులు, కార్యకర్తలే జెండాలు మోసేవారు. పూలు చల్లేవారు, బ్యానర్లు కట్టేవారు. కానీ పరిస్థితుల్లో మార్పు రావడంతో ప్రతిదానికి మనుషులకు ఇంతని ఇస్తే తప్ప కార్యక్రమాలకు రావడం లేదు, పనులు జరగడం లేదు. ప్రతిపనికి ఒక రేటు వసూలు చేస్తున్నారు. నేతలు ఎలాగూ ఎన్నికైన తర్వాత తమ గురించి పట్టించుకోరు కాబట్టి ఎన్నికలపుడే వచ్చినంత వరకు వసూలు చేసుకొందామనే ఆలోచనకు రావడమో మరేమోకానీ కూలీ ముట్టజెప్పందే ఎన్నికల కార్యక్రమాలకు జనం రావడం లేదు. ఏదిఏమైనా కోవూరు ఎన్నికలు రావడంతో వివిధ ప్రాంతాల వారు ఛలో కోవూరంటూ వెళ్తున్నారు.

# ముఖ్యమంత్రి పనితీరు బాగుంది!

● విజయవాడ ఎమ్మీ లగడపాటి మెచ్చుకోలు

కోవూరులో జరిగే ఉప ఎన్నికలు ప్రభుత్వ పనితీరుకు రెఫరెండం కాదని విజయవాడ ఎమ్మీ లగడపాటి రాజగోపాల్ స్పష్టం చేశారు. ఉప ఎన్నికల ప్రచారంలో భాగంగా జిల్లాకు వచ్చిన ఆయన విలేకరుల సమావేశం నిర్వహించారు. అవినీతి సొమ్ముతో కోట్లకు పడగలెత్తిన జగన్ ముఖ్యమంత్రి పీఠం కోసం అర్రులు చాస్తున్నాడని, ప్రజలను ప్రక్కదారి పట్టిస్తున్నాడని విమర్శించారు. ఆయన మాటలు నమ్మే స్థితిలో ప్రజలు లేరన్నారు. ఇక తెలుగుదేశం అధినేత నారా చంద్రబాబునాయుడు అధికారం కోసం కలలు కంటున్నాడని కానీ ఆయన ప్రజల విశ్వాసాన్ని ఏనాడో కోల్పోయాడన్నారు. వీరిద్దరూ ఎన్ని కుయుక్తులు పన్నినా, ఆరోపణలు చేసినా రాష్ట్ర ప్రజలు నమ్మరన్నారు. కాంగ్రెస్ పార్టీ హయాంలోనే రాష్ట్రం అన్ని రంగాలలో అభివృద్ధి సాధించిందన్నారు. ప్రస్తుత ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి చాలా బాగా పాలన సాగిస్తున్నాడని ప్రశంసలు కురిపించిన లగడపాటి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రవేశపెట్టిన పథకాలు నిర్వీర్యం చేశారని వస్తున్న ఆరోపణలను ఖండించారు. ఆయన ప్రవేశ పెట్టిన ఏ పథకం ఆగలేదని, ఫీజు రీఎంబర్స్‌మెంట్‌కు వైఎస్ మూడు వందల కోట్ల రూపాయలు ఇస్తే, కిరణ్‌కుమార్‌రెడ్డి మూడువేల కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నాడని తెలిపారు. నిరుద్యోగుల కోసం ఒక్క ఏడాదిలో లక్షన్నర ఉద్యోగాలిచ్చిన ఘనత కిరణ్‌కుమార్‌రెడ్డిదేనని ప్రశంసించారు.



నెల్లూరు ప్రెస్‌క్లబ్‌లో మాట్లాడుతున్న లగడపాటి.

# రాజుపాళెం సభకోసం అధికార దుర్వినియోగం!

ఎన్నికల ప్రచార సభ నిర్వహించిన ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి కోడ్ ఉల్లంఘించాడని తెలుగుదేశం పార్టీ పొలిట్ బ్యూరో సభ్యుడు కింజారపు ఎర్రంనాయుడు ఆరోపించారు. 10వ తేది తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో జరిగిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ నార్తురాజుపాళెంలో జరిపిన సభలో అధికార దుర్వినియోగం జరిగిందని, అడుగడుగునా ఎన్నికల నిబంధనలను అతిక్రమించారని విమర్శించారు. ముఖ్యమంత్రి తన ప్రసంగంలో ఓటర్లను ప్రలోభపెట్టేలా మాట్లాడారని తన సొంత నియోజకవర్గం అయిన పీలేరులాగే కోవూరును అభివృద్ధి పరుస్తానని చెప్పడం ప్రలోభానికి గురిచేయడమేనన్నారు. దీనిపై ఎన్నికల కమిషన్‌కు ఫిర్యాదు చేయనున్నట్లు తెలిపారు. ఉప ఎన్నికల బరిలో ఉన్న తెలుగుదేశం పార్టీ అభ్యర్థి చంద్రమోహన్‌రెడ్డికి ప్రజల ఆదరాభిమానాలు మెండుగా ఉన్నాయని, ఆయన విజయం తథ్యం అని ధీమా వ్యక్తం చేశారు. ఈ కార్యక్రమంలో పలువురు తెలుగుదేశం పార్టీ నేతలు పాల్గొన్నారు.

# శ్రీకాకుళం పోరాటాలే స్ఫూర్తి!

## రైతు కూలీ సంఘ నేత ఝాన్సీ పిలుపు

జిల్లాలో థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులు, ఎస్ఇజడ్‌లకు వ్యతిరేకంగా శ్రీకాకుళం జిల్లాలో చేపట్టిన పోరాటాలను స్ఫూర్తిగా తీసుకొని ఉద్యమించాలని రైతు కూలీ సంఘం రాష్ట్ర అధ్యక్షురాలు ఎన్.ఝాన్సీ పిలుపునిచ్చారు. నగరంలోని ఏనుగు సుందరరామిరెడ్డి ఆడిటోరియంలో జరిగిన స్త్రీ విముక్తి సంఘటన రాష్ట్ర సదస్సుకు ఆమె ముఖ్య అతిథిగా విచ్చేసి వివిధ అంశాలపై ప్రసంగించారు. జిల్లాలో నిర్మాణం అవుతున్న థర్మల్ విద్యుత్ ప్రాజెక్టుల వలన పలు ప్రాంతాలు బూడిదమయం కానున్నాయని, కాలుష్యం వ్యాపించి ప్రజలు అనారోగ్యం పాలయ్యే ప్రమాదముందని ఆందోళన వ్యక్తం చేశారు. పేదల నుంచి భూములు లాక్కొని పారిశ్రామికులకు, ధనవంతులకు కట్టబెడుతోందని విమర్శించారు. రైతుల నుంచి పంట పొలాలను తీసుకొని ఎస్ఇజడ్‌లంటూ ధారాధత్తం చేస్తోందని, ఎడాపెడా థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులకు అనుమతిస్తోందని ప్రభుత్వాన్ని దుయ్యబట్టారు. గాలి జనార్ధన్‌రెడ్డి వ్యాపారాల గురించి ప్రస్తావిస్తూ మొదట గాలి కృష్ణపట్నం పోర్టు నుంచే ఐరన్‌ఓర్ ఎగుమతి చేసి అక్రమాలకు తెరతీశాడని ఆరోపించారు. ఈ విషయం అధికారులకు తెలిసినా తెలియనట్లు నటించారని విమర్శించారు. ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా పోరాడాలని పిలుపునిచ్చారు.



# ఉపాధి హామీ పథకం పనుల సమీక్ష

జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం చీఫ్ విజిలెన్స్ అధికారి పి.కృష్ణయ్య జిల్లాలో జరుగుతున్న ఉపాధి హామీ పనులపై ఆ శాఖ ఉన్నతాధికారులతో సమీక్ష నిర్వహించారు. గత నెలలో పదవీ విరమణ చేసిన ఐఏఎస్ అధికారి పి.కృష్ణయ్యను రాష్ట్ర ప్రభుత్వం ఉపాధి హామీ పథకం చీఫ్ విజిలెన్స్ అధికారిగా నియమించిన సంగతి తెలిసిందే. బాధ్యతలు చేపట్టిన తర్వాత తొలిసారిగా నగరానికి వచ్చిన ఆయన డ్వామా కార్యాలయంలో అధికారులతో సమావేశమయ్యారు. గ్రామీణ ప్రాంతాల్లో ప్రధానంగా ఎస్సీ, ఎస్టీలకు చెందిన భూములు అభివృద్ధి పరచేందుకు ప్రాధాన్యతనివ్వాలని ఆదేశించారు. ఈ పథకం అమల్లో అవినీతి, అక్రమాలకు పాల్పడిన క్షేత్రస్థాయి సిబ్బందిపై వెంటనే చర్యలు తీసుకోవాలని ప్రాజెక్టు డైరక్టర్‌ను కోరారు. పథకం అమల్లో అక్రమాలకు పాల్పడకుంటే సామాజిక తనిఖీలకు పని ఉండదని అభిప్రాయపడ్డారు. మండలాల వారీగా చేపట్టిన పనుల వివరాలు అడిగి తెలుసుకున్నారు. ఈ సమీక్షలో డ్వామా పిడి యుగంధర్‌కుమార్, ఇతర అధికారులు, సిబ్బంది పాల్గొన్నారు.

# తోడేళ్లలా మారిన రాజకీయ పార్టీలు!

## కోవూరులో జయప్రకాష్ నారాయణ ప్రచారం

సాంప్రదాయ రాజకీయ పార్టీలు రాష్ట్రాన్ని తోడేళ్లలా దోచుకొంటున్నాయని లోక్‌సత్తాపార్టీ అధినేత డాక్టర్ జయప్రకాష్ నారాయణ విమర్శించారు. కోవూరు ఉప ఎన్నికల బరిలో వున్న లోక్ సత్తా అభ్యర్థి నర్సయ్యకు మద్దతుగా బుచ్చిరెడ్డి పాళెం తదితర చోట్ల ప్రచారం నిర్వహించారు. వివిధ పార్టీల నేతలు తమ స్వార్థం కోసం సంక్షేమ పథకాల పేరుతో ప్రజలను బిక్షగాళ్లను చేస్తున్నారని విమర్శించారు. సామాన్యుల భవిష్యత్తును సమాధి చేసి, ఆ సమాధులపై రాజకీయ రాక్షసులు, వారి వారసులు పునాదులు నిర్మించుకొంటున్నారని మండిపడ్డారు. కులం, వర్గం, మతం, ప్రాంతం, పార్టీల పేరుతో ప్రజల మధ్య చిచ్చుపెడుతున్నారని ఆగ్రహించారు. సాంప్రదాయ పార్టీల అభ్యర్థులు ఎన్నికల కోసం కోట్లాది రూపాయలు ఖర్చుపెడుతున్నారని, ఇంతచేసినా ఓడినవారు బికారైన సందర్భాలు చరిత్రలోనే లేవన్నారు. వీరి గెలుపు ఓటములపై కొందరు పందాలు కాస్తూ దండుకొంటున్నారని విమర్శించారు. ఇలాంటి తోడేళ్లను వారి అవినీతిని ప్రజలు తెలుసుకొని తమ ఓటుహక్కుతో అవినీతిపై తిరగబడాలని పిలుపునిచ్చారు. అందుకోసం లోక్‌సత్తాపార్టీ గుర్తు అయిన ఈల గుర్తుకు ఓటు వేసి తమ అభ్యర్థి నర్సయ్యను గెలిపించాలని అభ్యర్థించారు. ఈ కార్యక్రమంలో లోక్‌సత్తా నాయకులు నర్రా శ్రీధర్, కటారి శ్రీనివాసులు, తదితరులు పాల్గొన్నారు.

# పోలంరెడ్డిని ఆనంబ్రదర్స్ ఓడిస్తారు!



దామరమడుగు సభలో మాట్లాడుతున్న ప్రసన్న.

కోవూరు ఉప ఎన్నికల్లో పోటీ చేస్తున్న కాంగ్రెస్ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులరెడ్డిని ఆనం సోదరులే ఓడిస్తారని వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి వ్యాఖ్యానించారు. బుచ్చి మండలం రేబాలలో సినీనటి రోజాతో కలిసి విలేకరులతో మాట్లాడారు. పోలంరెడ్డిని ఓడించి తద్వారా ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డిని అప్రతిష్ట పాలుజేసేందుకు ఆనం సోదరులు ప్రయత్నిస్తున్నారని ఆరోపించారు. అధికారాన్ని అడ్డుపెట్టుకొని కాంగ్రెస్‌పార్టీవారు ఓటర్లను ప్రలోభపెట్టేందుకు ప్రయత్నిస్తున్నారని, ఎన్నికల నిబంధనలు అతిక్రమిస్తున్నారన్నారు. ముఖ్యమంత్రి బహిరంగ సభకు భారీగా జనాన్ని లారీలు, బస్సుల్లో తీసుకవచ్చారని, రికార్డింగ్ డాన్సులు చేయించారని తెలిపారు. ఆనం వివేకానందరెడ్డి ఈ కార్యక్రమం ఏర్పాటు చేయించారని తెలిపారు. మహిళలను అవమానించేలా ఇలాంటి డాన్సులు ఏర్పాటు చేసే బదులు వివేకానందరెడ్డే చీరకట్టుకొని డ్యాన్స్ చేస్తే బాగుండేదని వ్యంగ్యంగా మాట్లాడారు. వీరు వేసే వేషాలన్నింటిని ప్రజలు గమనిస్తున్నారన్నారు. జగన్ ప్రభంజనం రోజురోజుకు అధికం అవుతోందని, కోవూరులో తన గెలుపుకు ఢోకా లేదన్నారు. జిల్లా అధికారులు ఎన్నికలను పురస్కరించుకొని నిజాయితీగా వ్యవహరించాలని కోరారు.

# చిత్రవిచిత్ర వేషాలు

## కోవూరులో ఓటర్లను ఆకట్టుకోను నేతల పాట్లు

ప్రజలను ఆకట్టుకొనేందుకు నేతలు పలు పాట్లుపడుతుంటారు. ఇక ఎన్నికల్లోస్తే వారు చేసే ఫీట్లకు అంతే వుండదు. ఉప ఎన్నికలు జరుగుతున్న కోవూరులో వివిధ పార్టీల నేతలు ప్రచారాన్ని నిర్వహిస్తుండడంతో ఇలాంటి వాటికి కొదవే వుండడం లేదు. పగటి వేషాలు వేయడంలో దిట్టగా పేరుగాంచిన నెల్లూరు రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి ప్రచారంలో చిత్రవిచిత్ర విన్యాసాలు ఓటర్లకు నవ్వుతెప్పిస్తున్నాయి. టీ బంకుల్లోకి వెళ్లి టీ కాచి ఇవ్వడంతోపాటు, అక్కడ వుండే తెలుగుదేశం పార్టీ ఆఫీసుకు వెళ్లి నమస్కరిస్తూ అన్న, అక్క అంటూ అక్కడివాళ్లను పలకరించి కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థికి ఓటు వేయాలని కోరడం అక్కడి వారిని ఆశ్చర్యపరచింది. అంతేకాకుండా అక్కడున్న తెలుగు మహిళలను వారి యోగక్షేమాలు అడిగి మీరు ప్రచారం టిడిపికి చేయండి ఓట్లు మాత్రం కాంగ్రెస్‌పార్టీకి వేయండి అనడంతో అక్కడున్న వారు ఆశ్చర్యపోయారు. ఇక తెలుగుదేశం పార్టీ తరపున ప్రచారం నిర్వహిస్తున్న బిసి నేతలు, తామేమి తక్కువ కాదని నిరూపిస్తున్నారు. రావుల అంకయ్యగౌడ్ కుమారుడు దశయ్య గౌడ్ అయితే ఏకంగా తాటిచెట్టు ఎక్కి కల్లుగీయడం నాకు తెలుసు, నేనూ గీత కార్మికుడినేనంటూ వారిని తెలుగుదేశం పార్టీకి ఓట్లేయాలని అభ్యర్థిస్తున్నాడు. ఇందుకోసం ఆయన గీత కార్మికుడి వేషధారణలో తిరుతుండడం పలువురిని ఆకర్షిస్తోంది. ఇక చిరంజీవి, బాబు మోహన్, రోజా లాంటి సినిమా గ్లామర్ అదనపు ఆకర్షణ. మొత్తం మీద ఈ ఉప ఎన్నికలు మూడు పార్టీలకు జీవన్మరణ సమస్య కావడంతో ఓటర్లను ఆకట్టుకొనేందుకు రకరకాల ఫీట్లు చేస్తున్నారు.

● సోమిరెడ్డి గెలుపు కోసం

# చంద్రబాబు అలుపెరుగని ప్రచారం!

- ఒకటికి మూడుసార్లు కోవూరులో విస్తృత ప్రచారం.
- పోరాట యోధుడ్ని గెలిపించమని ప్రజలకు వినతి.

పేదరికం లేని సమాజం కోసం తెలుగుదేశం పార్టీ పాటుపడుతోందని, వారి సంక్షేమం కోసమే అహర్నిశలు శ్రమిస్తోందని ఆ పార్టీ అధ్యక్షుడు నారా చంద్రబాబు నాయుడు తెలిపారు. కోవూరు ఉప ఎన్నికలను ప్రతిష్ఠాత్మకంగా తీసుకొన్న ఆయన గతంలో ఎన్నడూ లేని విధంగా మూడవ పర్యాయం ప్రచారం కోసం మార్చి 14న మరోమారు విచ్చేశారు. నెల్లూరులో కారు దిగిన ఆయనకు తెలుగుదేశం పార్టీ నేతలు, కార్యకర్తలు స్కూటర్ ర్యాలీ నిర్వహించి అఖండ స్వాగతం పలికారు. వివిధ ప్రాంతాల్లో విస్తృతంగా ప్రచారం చేసి చంద్రబాబు నాయుడు కాంగ్రెస్, జగన్‌లపై తన దైనశైలిలో విరుచుకపడ్డారు. తొమ్మిదేళ్ల పాలనలో తెలుగుదేశంపార్టీ రాష్ట్రంలో చేసిన అభివృద్ధి పనులు వివరిస్తూ గత కొన్నేళ్లలో కాంగ్రెస్ ప్రభుత్వం చేపట్టిన ప్రజావ్యతిరేక విధానాలు, జగన్ అవినీతిని ప్రముఖంగా ప్రస్తావించారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి సంక్షేమ పథకాల పేరుతో రాష్ట్రాన్ని దోచుకొని, కోట్లాది రూపాయలు కుమారుడికి పంచిపెట్టాడని, వాటితో జగన్ ముఖ్యమంత్రి పీఠంపై కన్నేసి రాజకీయాలను భ్రష్టుపట్టిస్తున్నాడని తీవ్రంగా విమర్శించారు. తమపై ఎన్ని ఆరోపణలు చేసినా, విచారణలు జరిపించినా ఎక్కడా అవినీతి చూపలేకపోయారని, తమ నిజాయితీకి అదే నిదర్శనమన్నారు. మైనింగ్ మాఫియాతో చేతులు కలిపిన జగన్ కోట్లాది రూపాయలు కొల్లగొట్టాడన్నారు. ఆ డబ్బుతో ఎన్నికలలో గెలిచేందుకు ప్రయత్నిస్తున్నాడని, కానీ ప్రజలు తగిన గుణపాఠం చెప్తారన్నారు. నీతి నిజాయితీతో, జిల్లా అభివృద్ధికి, ప్రజల సమస్యలపై పోరాటం చేస్తున్న టిడిపి అభ్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డిని గెలిపించాలని ఓటర్లకు పిలుపునిచ్చారు.



ముదివర్తి సభలో మాట్లాడుతున్న చంద్రబాబునాయుడు.

సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి మాట్లాడుతూ ఈ ఎన్నికలు నీతికి, అవినీతికి మధ్య జరుగుతున్న ఎన్నికలని తెలిపారు. తెలుగుదేశంపార్టీ టిక్కెట్ ఇచ్చి గెలిపిస్తే ప్రసన్న నైతిక విలువలకు తిలోదకాలిచ్చాడని విమర్శించారు. సొంత ఆస్తులు కూడబెట్టుకొనేందుకు పూటకో పార్టీ మారుస్తూ ప్రజలను వంచించాడన్నారు. 2009 ఎన్నికల్లో గెలిచిన ప్రసన్న 16 రోజుల పండుగ పూర్తి కాకముందే లేచిపోయాడని వ్యంగ్యంగా విమర్శించారు. ప్రజలు సమస్యలు తెలిసిన వ్యక్తిగా, సమస్యలపై పోరాటం చేసిన వ్యక్తిగా తనను గెలిపించాలని ఓటర్లను కోరారు. ఎమ్మెల్యేను చేస్తే ప్రజల పక్షాన ప్రజా సమస్యలను అసెంబ్లీలో వినిపిస్తానని నియోజక వర్గాన్ని అన్ని విధాలా అభివృద్ధి చేస్తానని హామీ ఇచ్చారు. బిసిలే పార్టీకి వెన్నెముక అని, వారి కోసం సంక్షేమ పథకాలను చేపట్టింది తెలుగుదేశం పార్టీయేనని గుర్తు చేశారు.

## యోధాను యోధుల ప్రచారం

కోవూరు ఉప ఎన్నికలలో సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి విజయం సాధించడం ఖాయమని తెలుగుదేశం పార్టీ సీనియర్ నేతలు ధీమా వ్యక్తం చేశారు. ఎన్నికల ప్రచారం కోసం పార్టీ సీనియర్ నేతలు ఎర్రం నాయుడు, లాల్‌జాన్‌బాషా, బాబుమోహన్, కోడెల శివప్రసాద్‌రావు, వర్ల రామయ్య తదితరులు ఎన్నికల నగరా మోగినప్పటి నుంచి నియోజకవర్గంలో మకాం వేసి విస్తృతంగా ప్రచారం నిర్వహిస్తున్నారు. ఊరు వాడా తిరుగుతూ, నేరుగా ఓటర్లను కలుసుకొంటూ సోమిరెడ్డి సతీమణి జ్యోతి, కుమారుడు రాజగోపాల్‌రెడ్డి ఓట్లు అభ్యర్థిస్తూ సోమిరెడ్డిని గెలిపించాలని కోరుతున్నారు.



చంద్రమోహన్‌రెడ్డికి మద్దతుగా ప్రచారం చేస్తున్న ఎర్రంనాయుడు.

ఎన్నో ఉద్యమాలకు నాయకత్వం వహించిన సోమిరెడ్డి గెలుపుతో కోవూరు నియోజకవర్గం అభివృద్ధి చెందుతుందని ఎర్రం నాయుడు తెలిపారు. విడవలూరు, బుచ్చి, కొడవలూరు తదితర ప్రాంతాల్లో వీరు పర్యటించారు. అలాగే తెలుగుదేశం పార్టీ ఎమ్మెల్యేలు బల్లి దుర్గాప్రసాద్, బీద మస్తాన్‌రావు, కురుగొండ్ల రామకృష్ణ తమదైన శైలిలో ప్రచారం చేపడుతూ సోమిరెడ్డిని గెలిపించేందుకు కృషి చేస్తున్నారు. టిడిపి అధినేత చంద్రబాబు నాయుడు మూడవ పర్యాయం ఎన్నికల ప్రచారానికి రావడంతో కార్యకర్తల్లో సమరోత్సాహం నెలకొనింది.



సింహపురి హోటల్ అధినేత సన్నపరెడ్డి వెంకటరెడ్డి 8వ వర్ధంతి సందర్భంగా నివాళులర్పిస్తున్న ఆయన కుమారుడు శ్రీధర్‌రెడ్డి, హోటల్ సిబ్బంది తదితరులు.

# బియ్యం స్మగ్లర్లకు సహకరిస్తున్నారు!

● తడ రెవిన్యూ అధికారుల తీరిది.

బియ్యం అక్రమ రవాణాను అరికట్టాల్సిన అధికారులే స్మగ్లర్లతో చేతులు కలిపి కీలక సమాచారంపై ఉప్పందిస్తుండడంతో ఎక్కడి దొంగలు అక్కడే గప్‌చిప్ అన్న చందంగా వాళ్ళు అంతా సర్దుకుంటున్నారు. సూళ్లూరుపేట కేంద్రంగా చేసుకొని గత కొన్నేళ్లుగా స్మగ్లర్లు తమిళనాడు రేషన్ బియ్యాన్ని లారీలు, ప్యాసింజర్ రైళ్ల ద్వారా ఇక్కడికి తరలించేవారు. సూళ్లూరుపేటలో వీటికి స్టాక్‌పాయింట్లు ఏర్పాటు చేసుకొని తమ కార్యకలాపాలను సాగిస్తున్నారు. ఈ అక్రమ రవాణా వలన పలువురు ఆర్థికంగా బలవంతులు అయ్యారు. అయితే ఇటీవల తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత పేదలకు ఇచ్చే రేషన్ బియ్యం ఇతర ప్రాంతాలకు తరలిపోకుండా కఠిన చర్యలు తీసుకొన్నారు. దీంతో రైలు, రోడ్డు మార్గాలు మూసుకపోయాయి. స్మగ్లర్లు కొత్త ఎత్తు వేశారు. బియ్యం అక్రమ రవాణాకు పులికాట్ సరస్సును ఎంచుకొన్నారు. పడవల ద్వారా ఆ బియ్యాన్ని తమిళనాడు నుంచి వాటంబేడు గ్రామానికి చేర్చి అక్కడ నుంచి లారీల ద్వారా గమ్యస్థానానికి చేరవేస్తున్నారట. ఈ విషయాన్ని జిల్లా జాయింట్ కలెక్టర్ సౌరభ్ గౌర్ పసిగట్టి స్థానిక అధికారులను అప్రమత్తం చేశారు. పడవల ద్వారా వచ్చే బియ్యాన్ని పట్టుకోవాలని ఆదేశించారు. స్మగ్లర్లతో చేతులు కలిపిన అధికారులు ఈ సమాచారాన్ని వారికి చేరవేయడంతో బియ్యాన్ని ఎవరికంట పడకుండా దాచేశారు తడ తహశీల్దార్ అన్నపూర్ణ. పౌరసరఫరాలశాఖ డిప్యూటీ తహశీల్దార్ రవికుమార్ తమ సిబ్బందితో వాటంబేడు గ్రామంలో తనిఖీలు జరిపినా ఒక్క బియ్యం బస్తా దొరకలేదు.



# వైభవంగా ప్రసన్నుడి బ్రహ్మోత్సవాలు!

కొండబిట్రగుంట లక్ష్మీ ప్రసన్న వెంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలు వైభవంగా జరిగాయి. భక్తులు విశేషంగా పాల్గొని స్వామిని దర్శించుకొన్నారు. గరుడోత్సవానికి జిల్లా నలుమూలల నుంచి విచ్చేసిన భక్తులతో కొండబిట్రగుంట బిలకూట క్షేత్రం కిటకిటలాడింది. ఇక వెంకటేశ్వరుని కళ్యాణ్యాన్ని వీక్షించేందుకు భక్తులు బారులు తీరారు. స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు దంపతులు, ఒట్టిగుంట శ్రీనివాసులు దంపతులు ఉభయకర్తలుగా వ్యవహరించారు. కళ్యాణోత్సవం అనంతరం ప్రసన్నుడు రథంపై కొలువుదీరి భక్తులకు దర్శనమిచ్చాడు. మాజీ శాసనసభ్యుడు కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి, పిటి జగన్నాధం, దేవరాల సుబ్రహ్మణ్యం యాదవ్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అయితే ఒక చిన్న అపశృతి దొర్లింది. రథోత్సవాన్ని నిర్వహిస్తున్న సమయంలో రథచక్రం విరిగిపోవడంతో భక్తులు హడలిపోయారు. పోలీసులు చాకచక్యంగా వ్యవహరించడంతో ప్రమాదం తప్పింది. ఆలయ అధికారులు, నిర్లక్ష్యం వహించడం వల్ల ఈ ఘటన జరిగిందని పలువురు భక్తులు ఆరోపించారు.

● దేశం గర్వించదగ్గ విద్యా సంస్థ

# జవహర్‌భారతి!

దేశం గర్వించదగ్గ విద్యాసంస్థ జవహర్‌భారతి కళాశాల అని ప్రముఖ పాత్రికేయుడు 'జమీన్‌రైతు' సంపాదకుడు డోలేంద్రప్రసాద్ ప్రశంసించారు. డిగ్రీ కళాశాల వార్షికోత్సవ వేడుకలు మార్చి 7న కళాశాల ప్రాంగణంలో జరిగాయి. ఈ కార్యక్రమానికి డోలేంద్రప్రసాద్, ఆయన సతీమణి శైలజ ముఖ్యఅతిధులుగా విచ్చేశారు. విద్యార్థులనుద్దేశించి డోలేంద్ర మాట్లాడుతూ జవహర్‌భారతి విద్యార్థి అంటే దేశంలోనే ప్రత్యేక గుర్తింపు వుండన్నారు. తాను జెబి విద్యార్థిని కాకపోవడం బాధ కల్గించే అంశమన్నారు. విఆర్ కళాశాలలో చదువుకొనేటప్పుడు కావలి జవహర్ భారతి కళాశాల గురించి గొప్పగా చెప్పుకొంటుంటే వినేవాళ్లం అన్నారు. విద్యతోనే అభివృద్ధి సాధ్యమని నమ్మి ఆ దిశగా తన సర్వస్వం ధారపోసి విద్యాసంస్థ స్థాపించిన దొడ్ల రామచంద్రారెడ్డి మహోన్నతులని కొనియాడారు. కావలిలో ఏర్పాటైన ఈ విద్యాసంస్థ దేశ, విదేశాలలో గుర్తింపు పొందిందన్నారు.




జవహర్‌భారతి వార్షికోత్సవ సభలో మాట్లాడుతున్న జమీన్‌రైతు సంపాదకుడు నెల్లూరు డోలేంద్రప్రసాద్.

దేశానికి ఎందరో ఐఏఎస్, ఐపిఎస్, ఇతర ఉన్నతాధికారులను అందించిన ఘనత జెబి కళాశాలకు, దాని స్థాపకుడు డిఆర్‌కు దక్కుతుందన్నారు. అనంతరం క్రీడల్లో విజేతలైన వారికి, ప్రతిభ చూపిన విద్యార్థిని, విద్యార్థులకు డోలేంద్ర ప్రసాద్ సతీమణి శైలజ బహుమతులను అందజేశారు. ఈ కార్యక్రమంలో కళాశాల ప్రిన్సిపాల్ సయ్యద్ ముక్రమ్, కరస్పాండెంట్ కెవి.రమణయ్య, డైరెక్టర్ దొడ్ల వినయ్‌కుమార్‌రెడ్డి, వైస్ ప్రిన్సిపాల్ మనోహర్ తదితరులు పాల్గొన్నారు.

● చిట్టమూరులో

# నీటి ఎద్దడి!

చిట్టమూరు మండలంలోని పలుగ్రామాల్లో నీటి ఎద్దడి నెలకొని వుంది. గొంతు తడుపుకోవాలంటే గుక్కెడు నీళ్ల దొరక్క అల్లాడిపోతున్నారు ప్రజలు. కోట్లాది రూపాయల నిధులు ఖర్చు చేసి మంచినీటి సరఫరాకు చర్యలు చేపడుతున్నామని చెప్పున్న పాలకులు, అధికారుల మాటలు చేతలకు నోచుకోవడం లేదనేందుకు ఇలాంటి ప్రాంతాలే నిదర్శనం. మండలంలో ఎల్లసిరి గ్రామాన్ని పరిశీలించినట్లయితే మంచినీటి కోసం ప్రజలు పడుతున్న పాట్లు తెలుస్తాయి. దాహార్తి తీర్చుకొనేందుకు బిందెలు చంకన పెట్టుకొని సుదూర ప్రాంతాలకు మహిళలు పరుగు తీయాల్సి వస్తోందంటే మంచినీటి సమస్య ఎంత తీవ్రంగా వుందో అర్థమవుతుంది. వందలాది కుటుంబాలు నివసిస్తున్న ఈ ప్రాంతంలో ప్రభుత్వ పథకాలు ఏమాత్రం దరిచేరకపోవడంతో ఏడాదిపొడవునా నీటి కోసం పాట్లు పడాల్సి వస్తోంది. మరికొన్ని ప్రాంతాల్లో వున్న పైపులు దెబ్బతినిపోయి మంచినీటి సరఫరా జరగక, వాటి బాగోగులు పట్టించుకొనేవారే లేక నీటి పథకాలు నిష్ప్రయోజనంగా మారుతున్నాయి. వేసవి ప్రారంభంలోనే ఈ పరిస్థితి ఉత్పన్నం అవుతుంటే రానున్న రోజుల్లో మంచినీటి సమస్య ఇంకెంత తీవ్రంగా వుంటుందోనని ప్రజలు ఆందోళన చెందుతున్నారు.

● షాక్‌తో

# లైన్‌మెన్ మరణం!

విద్యుత్ మరమ్మత్తులు చేస్తున్న లైన్‌మెన్ మరణించిన ఘటన తడ మండలం వెండ్లూరుపాడు గ్రామంలో జరిగింది. వాటంబేడు గ్రామంలో అసిస్టెంట్ లైన్‌మెన్‌గా వున్న మునిరాజా వెండ్లూరుపాడులో విద్యుత్ మరమ్మత్తులకు వచ్చాడు. అక్కడ పని చేస్తున్న వ్యక్తి సెలవుపై వుండడంతో ఇతను రావాల్సి వచ్చింది. 11కెవి సబ్ స్టేషన్ పరిధిలో మరమ్మత్తులు చేస్తుండగా హఠాత్తుగా విద్యుత్ సరఫరా జరగడంతో స్తంభం నుంచి పడి అక్కడికక్కడే

## కరెంట్ వదిలింది ఎవరు?

మృతి చెందాడు. అధికారులు విద్యుత్ సరఫరా నిలిపి వుంచి మరమ్మత్తులు చేయించాల్సి వుండగా నిర్లక్ష్యంగా వ్యవహరించడంతోనే మునిరాజా మరణించాడని అతని కుటుంబ సభ్యులు, బంధువులు ఆరోపిస్తూ ఆందోళనకు దిగారు. ట్రాన్స్‌కో అధికారులు, పోలీసులు అక్కడకు చేరుకొని మృతుని కుటుంబానికి న్యాయం జరిగేలా చేస్తామని హామీ ఇవ్వడంతో బాధిత కుటుంబసభ్యులు శాంతించారు. మొత్తం మీద ఇలాంటి ఘటనలు అక్కడక్కడ జరుగుతుండడంతో విద్యుత్‌శాఖ అధికారులపై విమర్శలు వస్తున్నాయి.

# రైతుల ఆత్మహత్యలకు బాధ్యత వహించాలి!

**కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు**

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల తీరు వలన దేశంలో ప్రతి ఏటా 2.5లక్షల మంది రైతులు ఆత్మహత్య చేసుకొంటున్నారని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు విమర్శించారు. రైతుల బాగోగులు పట్టించుకోకపోవడం వల్లనే ఈ ఆత్మహత్యలు జరుగుతున్నందున వీటిని ప్రభుత్వం చేయిస్తున్న హత్యలుగా అభివర్ణించారు. కావలి జవహర్ భారతి కళాశాలలో ఏర్పాటుచేసిన బయోటెక్నాలజి కోర్సును ప్రారంభించిన అనంతరం ఆయన విలేకరులతో మాట్లాడుతూ సెజ్‌ల పేరుతో రైతుల పొట్టకొట్టి బడాబాబులకు కట్టబెడుతోందన్నారు. గతంలో రాచర్ల పాడు వద్ద ఇఫ్కో పేరుతో రెండు వేల ఎకరాలు సేకరించిందని, ఇటీవల సెజ్‌ల పేరుతో వేలాది ఎకరాలు పంట పొలాలను పారిశ్రామికవేత్తలకు ధారాదత్తం చేసిందన్నారు. ఎన్‌డిఏ ప్రభుత్వం అధికారంలో వుండగా నదుల అనుసంధానం కోసం 5లక్షల కోట్ల రూపాయలు కేటాయించారని, ఆ పథకం అమలై వుంటే నదులు అనుసంధానం జరిగి నీరు సముద్రం పాలవకుండా వ్యవసాయానికి ఉపయోగపడేదన్నారు. పాలకుల్లో రైతుల పట్ల నిర్లక్ష్యం కారణంగా రైతాంగం ఆర్థికంగా చితికిపోతున్నారన్నారు.

# ఆత్మకూరులో వెంకటేశ్వరస్వామి!

**ఘనత రాఘవేంద్రరెడ్డిది.**



ఆత్మకూరు పట్టణంలో శ్రీ వెంకటేశ్వరస్వామి దేవస్థానాన్ని కట్టించి తన కల నెరవేర్చుకొన్నాడు శాసనమండలి మాజీ సభ్యుడు బొమ్మిరెడ్డి రాఘవేంద్ర రెడ్డి. మొదట పట్టణంలో పడమరవైపు వున్న తిప్ప మీద గుడి కట్టాలని ప్రయత్నించినప్పుడు భక్తులకు అసౌకర్యంగా వుంటుందని భావించి, కాలగాని రామయ్య ధర్మ సత్రానికి చెందిన స్థలంలో ప్రభుత్వ అనుమతితో సొంత నిధులు వెచ్చించి వెంకటేశ్వర స్వామి ఆలయాన్ని అందంగా తీర్చిదిద్దారు. ఆలయ నిర్మాణం కోసం శంకుస్థాపన చేసిన 11నెలల వ్యవధిలో ఒకటిన్నర కోటిరూపాయలు ఖర్చు చేసి సుందరంగా నిర్మించారు. ఇటీవల త్రిదండి చిన్నజీయరుస్వామి చేతుల మీదుగా విగ్రహ ప్రతిష్టాపన మహోత్సవాన్ని ఘనంగా నిర్వహించి, వెంకటేశ్వర కళ్యాణాన్ని జరిపించారు. ఆలయం నిత్య పూజలతో దినదిన ప్రవర్ధమానం చెందేందుకు వీలుగా మూడు వందల మందిని నిత్యపూజలకు ఉభయదాతలను చేసి దాదాపు 20లక్షల రూపాయలు వసూలు చేశారు. గుడి నిర్మాణం కోసం అక్కడ నివాసం వుండిన ఎస్సీ, బిసి కుటుంబాలకు నష్టపరిహారం చెల్లించి మరో ప్రదేశంలో వారికి నివాస స్థలాన్ని చూపించి తమ దాతృత్వాన్ని చాటుకొన్నారు. బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి కృషితో ఆత్మకూరులోని ప్రజలకు ప్రతినిత్యం కలియుగ దైవం వెంకటేశ్వరస్వామి దర్శన భాగ్యం కల్గింది.

# కడుపు మండిన వెంకటగిరి రైతు!

రైతు కార్యాచరణ కమిటీ ఆధ్వర్యంలో వెంకటగిరి పట్టణంలో రైతులు రాస్తారోకో చేపట్టారు. ధాన్యానికి గిట్టుబాటు ధర కల్పించాలని, మినుము రైతులను ఆదుకోవాలని, ఎరువుల ధరలు తగ్గించాలని డిమాండ్ చేస్తూ రైతులు నిరసన ప్రదర్శన చేపట్టారు. ఈ సందర్భంగా రైతు కూలీ సంఘం రాష్ట్ర కార్యదర్శి కిషోర్‌బాబు మాట్లాడుతూ

## గిట్టుబాటు ధర కోసం రాస్తారోకో

సంఘటిత ఉద్యమాల ద్వారానే రైతుల సమస్యలు పరిష్కారం అవుతాయన్నారు. రైతులందరూ కలసికట్టుగా ఉద్యమించినపుడే సమస్యలు పరిష్కారం అవుతాయని పిలుపునిచ్చారు. అనంతరం తహశీల్దార్‌ను కలసి వినతి పత్రం సమర్పించారు. ఈ నిరసనలో రైతు నేతలు రవీంద్ర, రమణయ్య, సుబ్బరాయులు, సునీత, రైతు కార్యాచరణ సమితి నేతలు కృష్ణారెడ్డి, రాజారెడ్డి, రామచంద్రయ్య తదితరులు పాల్గొన్నారు.

# ఆస్పత్రిలేక అగచాట్లు!

## బోగోలువాసుల బాధ పట్టదా?

బోగోలు మండలంలో అత్యవసర వైద్యం అందించేందుకు ఆస్పత్రి లేకపోవడంతో వివిధ ప్రాంతాల ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడాల్సి వస్తోంది. మేజర్ పంచాయితీ అయిన బోగోలుతోపాటు మండలంలోని పలు ప్రాంతాల వారికి అత్యవసర వేళలు, ఆపద సమయాల్లో సత్వర చికిత్స అందించేందుకు తగిన ఆస్పత్రి లేకుండా పోయింది. వేళకాని వేళల్లో, అనుకోని పరిస్థితుల్లో ఎవరికైనా బాగాలేకుండా వస్తే, అనారోగ్య పరిస్థితుల్లో చికిత్స అందించే నాధుడే లేకపోవడంతో కావలి, నెల్లూరుకు పోవాల్సి వస్తోందని మండల ప్రజలు వాపోతున్నారు. మండలంలో లక్షపైన జనాభా గల ఇక్కడ 24 గంటలు అందుబాటులో వుండే ప్రభుత్వ ఆస్పత్రిని ఏర్పాటు చేయాలని చాలా కాలంగా ప్రజలు కోరుకొంటున్నా అధికారులు పట్టించుకోలేదు. ధనవంతులు ప్రైవేట్ డాక్టర్ల వద్దకు వెళుతున్నా, పేదలు ఆ ఖర్చు భరించలేక వైద్యం సకాలంలో అందక ప్రాణాల మీదకు తెచ్చుకొంటున్నారు. ప్రజల ఆరోగ్యాన్ని, అవసరాలను దృష్టిలో వుంచుకొని బోగోలులో వైద్యకేంద్రాన్ని ఏర్పాటు చేయాలని పలువురు కోరుకొంటున్నారు.

● కావలిలో

# ఎన్టీఆర్ విగ్రహమెప్పుడు?

**శంకుస్థాపనతో సరి**

తాళం వేసితిని గొళ్లెం మరచితిని అన్న చందంగా వుంది కావలి తెలుగుదేశం పార్టీ నాయకుల తీరు. పట్టణం నడిబొడ్డున ఎన్టీఆర్ రామారావు విగ్రహం ఏర్పాటు చేయాలని తెలుగుదేశం పార్టీ నిర్ణయించింది. దీనికి స్పందించిన మాజీ శాసనసభ్యుడు వంటేరు వేణుగోపాలరెడ్డి దిమ్మె కట్టించేందుకు ముందుకు రాగా, స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు విగ్రహం ఖర్చు భరించేందుకు ముందుకు వచ్చారు. దీంతో ఎమ్మార్వో ఆఫీసు ఎదురుగా రోడ్డుపై గుంట త్రవ్వి విగ్రహం పెట్టేందుకు పూజాది కార్యక్రమాలు చేపట్టాడు వంటేరు. ఇది జరిగి దాదాపు రెండు నెలలు గడిచింది. అప్పటి నుంచి ఇప్పటివరకు ఎలాంటి పని జరగకపోవడంతో నడిరోడ్డులో తీసిన గుంట ప్రమాదకరంగా మారింది. రద్దీగా వుండే ఈ రోడ్డుపై నిత్యం ప్రయాణించే వారు అదుపు తప్పి ఈ గుంటలో పడి ప్రమాదాలకు గురౌతున్నారు. ముఖ్యంగా స్కూలు పిల్లలు, కళాశాలకు వెళ్లే విద్యార్థులు సైకిళ్లల్లో వెళ్తూ గుంటలో పడి గాయాలపాలయ్యే వారి సంఖ్య అధికంగా వుంటోంది. దీంతో కావలి పట్టణ ప్రజలు తెలుగుదేశం పార్టీ నాయకులను నోరారా తిట్టుకొంటున్నారు. ఇక తెలుగుదేశంపార్టీ కార్యకర్తల్లో విగ్రహం ఏర్పాటుపై అయోమయం నెలకొనింది. దిమ్మె ఎప్పుడు కడతారో ఎన్టీఆర్ విగ్రహం ఎప్పుడు పెడతారోనని చర్చించుకొంటున్నారు.

# తెలుగు సంవత్సరాది 'ఉగాది'

తెలుగువారు జరుపుకొనే పండుగలలో ముఖ్యమైనది ఉగాది. ఆరోజు నుంచే తెలుగు నూతన సంవత్సరం ఆరంభమవుతుంది. మత్స్యావతారం ధరించిన శ్రీమహావిష్ణువు సోమకుడిని సంహరించి వేదాలను తిరిగి బ్రహ్మకు అందించిన సందర్భంగా ఉగాది పండుగ ఆచరణలోనికి వచ్చిందని పురాణ కథనం. చైత్ర శుద్ధ పాడ్యమి నాడు బ్రహ్మ సృష్టిని నిర్మించడం ప్రారంభించాడట. శుక్లపక్ష పాడ్యమి రోజు సూర్యోదయవేళ సమగ్రంగా నిర్మించాడట. జగత్తును కాలాన్ని గణన చేసి గ్రహ, నక్షత్ర, ఋతు, మాస, వర్ష, వర్షాధికాలను ప్రవర్తింపజేశాడట. ఆనాటి నుంచి ఉగాదిని సంవత్సర ఆరంభంగా భావించి పండుగగా జరుపుకోవడం అనాదిగా వస్తున్న ఆచారం. యుగానికి ఆరంభం కనుక అది ఉగాదిగా పిలవబడిందని చెప్తారు. ఉగాది ఆచరణలను ధర్మసింధువులో పేర్కొనబడి వుంది.

కొత్త జీవితానికి స్వాగతం చెబుతూ జరుపుకొనే ఈ ఉగాదితో వసంత ఋతువు ఆరంభమవుతుంది. శాలివాహనుడు పట్టాభిషిక్తుడైన రోజుగా దీనిని చెప్తారు. ఉగాదినాడు ఆచరించాల్సిన వాటిలో ముఖ్యమైనవి ఉగాది పచ్చడి తినడం, పంచాగ శ్రవణం. తీపి, కారం, వగరు, చేదు, పులుపు, ఉప్పు అనే షడ్రుచుల (ఆరు రుచులు) సమ్మేళనమే ఉగాది పచ్చడి. ఈ పచ్చడి తినడం వలన ఆ సంవత్సరంలో ఎదురయ్యే మంచి చెడులను, కష్టనష్టలను, సుఖదుఃఖాలను సమానంగా, సంయమనంతో స్వీకరించే అలవాటు లభిస్తుందనేది ఈ పచ్చడిలో గల పరమార్థం. దీనినే నింబ కుసుమ భక్షణం అని, అశోక కళిక అని పిలుస్తారు. ఋతువు మారేటప్పుడు ఏర్పడే వాత, పిత్త, కఫ దోషాలను తొలగించే శక్తి ఉగాది పచ్చడికి వుందని ఆయుర్వేద వైద్య శాస్త్రపరంగా చెప్తారు. ఇక పండుగనాడు ప్రధానమైనది పంచాగ శ్రవణం. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలనే ఐదు అంగాలను కల్గించే పంచాగం. 15 తిథులు, 7వారాలు, 27 నక్షత్రాలు, 27 యోగాలు, 11 కరణాల సమ్మేళనం ఇది. కొత్త సంవత్సరం రాశిఫలాలను తెలుసుకొని రాజపూజ్యం, అవమానం, ఆదాయ వ్యయాలను, దేశ పరిస్థితులు, రైతుల స్థితిగతులను తెలుసుకొనేందుకు పంచాగ శ్రవణాన్ని నిర్వహించడం ఆనవాయితీ. పండుగనాడు పొద్దుటే లేచి స్నానమాచరించి, కొత్తబట్టలు కట్టుకొని ఇష్టదైవాన్ని పూజించి పరగడుపున మామిడి, వేపపూత, కొత్త బెల్లం, చింతపండు, ఉప్పు, పచ్చి మిరపకాయలతో తయారు చేసే ఉగాది పచ్చడి తినడం వలన ఆరోగ్యపరంగాను మంచిదని పండితులు చెప్తున్నారు. మార్చి 23 ఉగాది పండుగ.



## ట్రంకు రోడ్డు కబుర్లు

### పాత్రికేయులు... పురుగులు!

ఎన్నికల సమయంలో న్యూస్ కవరేజీ కోసం పాత్రికేయులను అన్ని రాజకీయ పార్టీలు మర్యాదగా చూసుకొనేవి. కోవూరు ఉప ఎన్నికలను పురస్కరించుకొని ఆ ట్రెండు మారింది. ప్రధాన తెలుగు దినపత్రికల యాజమాన్యాలకు ఒకరంటే ఒకరికి పొడగిట్టకపోవడంతో తమకు అనుకూల అభ్యర్థులకు అనుకూలంగా వార్తలు, వ్యతిరేక వార్తలు, ఫోటోలు రావడం ఎక్కువయ్యింది. దీంతో ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి, ప్రతిపక్ష నేత చంద్రబాబునాయుడు, వైకాపా నేత జగన్ నియోజకవర్గంలో విస్తృతంగా పర్యటించినా ఏ పార్టీ కూడా మీడియాను ప్రత్యేక వాహనాలు పెట్టి తీసుకొని వెళ్లలేదు. అలవాట్లో పొరపాటుగా ఈ విషయమై అడిగిన పాత్రికేయులను బుద్ధదని అందరూ చెప్పుకొనే జిల్లా పరిషత్ మాజీ ఛైర్మన్ కాకాణి కూడా ఈసడించుకొన్నాడట. పార్టీల అసలు స్వరూపం చూసిన తర్వాత కొందరు పాత్రికేయుల్లో అంతర్ మథనం మొదలవ్వడం విశేషం.

### కోతలే కోతలు!

విద్యుత్ శాఖాధికారులు విద్యుత్ కోత వేళలపై చెబుతున్న దొకటి చేస్తున్న దొకటి. నెల్లూరు నగరంలో ఉదయం, సాయంత్రం వేళల్లో కలిపి నాలుగు గంటలు అధికారిక కోతగా ప్రకటించారు. ఈ వేళల్లోనేగాక మధ్యమధ్యలో అరగంట, గంట వ్యవధిలో అనధికార కోతలు విధిస్తున్నారు. ఈ విషయమై విద్యుత్ సహాయ కేంద్రానికి ఫోను చేస్తే కోతలు 'పైనే' విధిస్తున్నారని చెబుతున్నారు. మార్చి చివరి నుంచి ఉన్నది ముసళ్ల పండుగని జనాన్ని ఇంకాస్త హడలగొడుతున్నారు. ఈ సీజన్‌లో వీళ్లు, వాళ్లు అనే తేడాలేకుండా ట్రంకు రోడ్డుతోపాటు హోల్ జిల్లా తిట్టించుకొనేవారెవరైనా ఉన్నారంటే వాళ్ల కరంటోళ్లే సుమా!

### స్టార్ అట్రాక్షన్ ఆ చిన్నారి!

కోవూరు ఉప ఎన్నికల్లో తమ పార్టీ అభ్యర్థులకు యోధానుయోధులైన నేతలు వచ్చి ప్రచారం చేస్తున్నా ఆ ప్రచారాల్లో లోటుపాట్లు ఉంటున్నాయి. తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు చంద్రబాబునాయుడిని ఇందుకూరుపేట మండలం ప్రచారంలో తనలా రెండు వేళ్లతో విక్టరీ గుర్తు చూపుతున్న నాలుగేళ్ల చిన్నారి బాగా ఆకర్షించింది. వెంటనే ఆ పాపను తన ప్రచార రథంపై ఎక్కించుకొన్నాడు. పాప నెత్తిపై తెలుగుదేశం పార్టీ టోపీ పెట్టారు. చంద్రబాబు మహోగ్రంగా మాట్లాడుతున్నా ఆ చిన్నారి పట్టించుకోలేదు. చిరునవ్వుతో విక్టరీ గుర్తు చూపుతూనే ఉండింది. ఈ పాపకు మంచినీళ్లు త్రాగించడం, బిస్కెట్లు తినిపించడంలో సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి బిజీగా కనిపించడం చర్చనీయాంశమయ్యింది.

### పాపం... బొత్సా!

పిసిసి అధ్యక్ష బాధ్యతలతోపాటు రాష్ట్ర రవాణా శాఖా మంత్రిగా బొత్సా సత్యనారాయణ పనిచేస్తున్నారు. ఉత్తరాంధ్రలో ఆయన 'పవర్‌ఫుల్' నేత కావచ్చు. నెల్లూరులో 'ఏటీ' అనుకున్నారో ఏమో... 9వ తేది కోవూరు ఉప ఎన్నికల సందర్భంగా సిఎం ప్రసంగించిన బహిరంగసభ వేదిక, ప్రాంగణంలో ఎక్కడా ఫ్లెక్సీలపై బొత్సా సత్యనారాయణ బొమ్మ కనపడలేదు. జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రి పితాని సత్యనారాయణ, మరోమంత్రి మోపిదేవి వెంకట రమణ, బాపట్ల ఎమ్పీ పనబాక లక్ష్మి, తిరుపతి ఎమ్పీ చింతా మోహన్ ఫోటోలకు చోటు దొరికినా పిసిసి అధ్యక్షుడ్ని మాత్రం చిన్నచూపు చూశారని ట్రంకురోడ్డులో బొత్సా సత్యనారాయణ గారి అభిమానులు రుసరుసలాడుతున్నారు. దీనికి ఆనం బ్రదర్స్ ఏమంటారో?

### అల్లుడుగారి నామోషీ...

ముఖ్యమంత్రి నల్లారి కిరణ్‌కుమార్‌రెడ్డి నెల్లూరు'జిల్లా' అల్లుడని అందరికీ తెలుసు. ఆయనకు పిల్లనిచ్చిన మామ రమణారెడ్డి గారి స్వగ్రామం పద్మనాభసత్రం. కొడవలూరు మండలంలోని ఈ గ్రామం కోవూరు నియోజకవర్గ పరిధిలోనిది. పద్మనాభసత్రానికి ఎనిమిది కిలోమీటర్ల దూరంలోని నార్తురాజుపాళెంకు ఎన్నికల ప్రచారానికి వెళ్లిన ముఖ్యమంత్రి నేను ఈ నియోజకవర్గం... ఈ మండలానికి చెందిన అల్లుడినని తన పరువు నిలపను కాంగ్రెస్ అభ్యర్థిని గెలిపించమని చెప్పకపోవడంపై గుసగుసలు వినిపించాయి. అల్లుడిగారికి నామోషీగా తోచిన అంశమేమిటని పలువురు వ్యాఖ్యానించుకోవడం వినిపించింది.

# ఫ్యాను గాలికి ఆ రెండు పార్టీలు కొట్టుకపోతాయి!

## ● కోవూరు ప్రచార సభల్లో వైఎస్.జగన్మోహన్‌రెడ్డి

విలువలులేని రాజకీయాలకు, విశ్వసనీయతకు కోవూరు ఉప ఎన్నికలు పరీక్ష అని వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షుడు వైఎస్ జగన్మోహన్‌రెడ్డి వ్యాఖ్యానించారు. కోవూరు ఉప ఎన్నికల్లో వైఎస్‌ఆర్ పార్టీ అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తరపున ప్రచారం నిర్వహించేందుకు రెండవసారి ఆయన జిల్లాకు విచ్చేశారు. మొదటిసారి ఐదు రోజులు మకాం వేసి విస్తృతంగా ప్రచారం నిర్వహించిన జగన్ రెండవ విడత ప్రచారం కోసం మార్చి 14తేది వచ్చారు. దామరమడుగు, బుచ్చిలో ప్రచారం ప్రారంభించిన ఆయనకు అడుగడుగునా ప్రజలు నీరాజనాలు పలికారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ పేద ప్రజల పక్షపాతి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అనేక సంక్షేమ పథకాలను చేపడితే కాంగ్రెస్ ప్రభుత్వం వాటికి తూట్లు పొడిచిందన్నారు. పేదలకు అండగా నిలచిన వైఎస్‌ను అప్రతిష్ట పాల్జేసేందుకు కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు కుమ్మక్కయ్యాయని ఆరోపించారు. వైఎస్ ఆశయాలను సాధించేందుకు, మంచి సమాజం కోసం, పేద ప్రజల కష్టాలు తీర్చేందుకు తమ పార్టీ ప్రయత్నిస్తున్నదన్నారు. ఈ పరిస్థితుల్లో చంద్రబాబు నాయుడు, కాంగ్రెస్‌పార్టీలు అనుసరిస్తున్న విధానాలు భ్రష్టు పట్టిన, కుళ్లిన రాజకీయాలకు నిదర్శనం అన్నారు. వీరు ఎన్ని కుట్రలు చేసినా, కుయుక్తులు పన్నినా రాష్ట్రప్రజలు తమవైపే వున్నారని ప్రకటించారు. విజ్ఞత గల ఓటర్లు తమ పార్టీ అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి ఫ్యాన్ గుర్తుపై ఓటు వేసి అఖండ మెజారిటీతో గెలిపించాలని కోరారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి కోసం తమ పదవులను త్యాగం చేసిన ప్రసన్న, మేకపాటి బ్రదర్స్‌ను తిరిగి గెలిపించుకోవాల్సిన బాధ్యత అందరిపై వుందన్నారు.



వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి మాట్లాడుతూ జగన్మోహన్‌రెడ్డి, విజయమ్మలకు కేటాయించిన ఫ్యాను గుర్తే తనకు రావడం పట్ల ఆనందం వ్యక్తం చేశారు. ఫ్యాన్ గాలికి తెలుగుదేశం, కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థుల డిపాజిట్లు గల్లంతవుతాయన్నారు. రాష్ట్రానికి జగన్ నాయకత్వం అవసరమని, రాష్ట్రప్రజలు దీనినే కోరుకొంటున్నారన్నారు. సోనియాను ఎదిరించిన ఏకైక నాయకుడు జగన్మోహన్‌రెడ్డేనన్నారు. కోవూరు ప్రజలు తనపట్ల చూపుతున్న అభిమానాన్ని ఎన్నటికి మరవ లేనని తెలిపారు. ఎన్నికలలో తనను గెలిపించి జగన్ నాయకత్వాన్ని బలపరచాలని కోరారు. ఈ ప్రచార కార్యక్రమంలో మాజీ ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, కాకాణి గోవర్ధన్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### ● ఇంటింటా ప్రచారంలో

## ప్రసన్న కుటుంబ సభ్యులు



కోవూరు ఉప ఎన్నికల బరిలో వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థిగా పోటీలో వున్న నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి తరపున వారి కుటుంబ సభ్యులు ఇంటింటా ప్రచారం నిర్వహిస్తూ ఓటర్లను కలుసుకొని గెలిపించాలని కోరుతున్నారు. ప్రసన్న కుమారుడు రజిత్‌కుమార్‌రెడ్డి, సతీమణి గీతమ్మ విస్తృత ప్రచారం చేపట్టారు. కోవూరు నియోజకవర్గ అభివృద్ధికి ప్రసన్నకుమార్ రెడ్డి చేసిన సేవలను గుర్తు చేస్తూ ఓటర్లను ఆప్యాయంగా పలకరిస్తూ వీరిరువురు చేస్తున్న ప్రచారం పలువురిని ఆకర్షిస్తోంది. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేపట్టిన సంక్షేమ పథకాలు అమలు కావాలన్నా, రాష్ట్రానికి మేలు జరగాలన్నా వైఎస్ ఆర్ కాంగ్రెస్ పార్టీని గెలిపించాల్సిన అవసరం ఎంతైనా వుందంటూ ప్రసన్న తనయుడు రజిత్ కుమార్‌రెడ్డి ఓటర్లను ఆకట్టుకొనేలా ప్రసంగించడం చూసిన యువకులు వారి వెంట నడుస్తున్నారు. వీరితోపాటు సినీనటి రోజా, లక్ష్మీపార్వతి, వంగపండు ఉష, ఇతర నేతలు విస్తృతంగా ప్రచారం నిర్వహిస్తుండడం క్యాడర్‌లో మంచి ఊపు తెచ్చింది.

## గ్రామీణ పాఠశాలల్లో పారిశుద్ధ్య క్లబ్‌లు!

గ్రామీణ పాఠశాలల్లో వచ్చే విద్యా సంవత్సరం నుంచి పారిశుద్ధ్య క్లబ్‌లు ఏర్పాటు కానున్నాయి. వీటి ఏర్పాటుకు కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ నిధులు కేటాయించనుంది. పరిసరాల పరిశుభ్రతపై విద్యార్థులకు మరింత అవగాహన కల్పించాలన్న సంకల్పంతో కేంద్ర ప్రభుత్వం పారిశుద్ధ్య క్లబ్‌ల ఏర్పాటుకు శ్రీకారం చుట్టనుంది. పాఠశాలలో క్లబ్‌ల ఏర్పాటుకు మూడు వేల రూపాయలు మంజూరు చేస్తారు. బహిరంగ మల విసర్జన ఆరోగ్యంపై తీవ్ర ప్రభావం చూపడం వల్ల అనేక మంది అనారోగ్యం పాలవుతున్న విషయం వివిధ శాఖలు నిర్వహించిన సర్వేలో తేలింది. శాస్త్ర, సాంకేతిక రంగాల్లో దేశం అభివృద్ధి పథంలో పయనిస్తున్నా గ్రామీణ ప్రాంతాల్లో ఇప్పటికి 70 శాతం మంది బహిరంగ మలవిసర్జన చేస్తున్నారు. విద్యార్థులతోపాటు ప్రజలకు కూడా అవగాహన కల్పించి మరుగుదొడ్లు నిర్మించుకొనేందుకు పూర్తి సహకారం అందిస్తారు. ఇప్పటి వరకు మరుగుదొడ్ల నిర్మాణానికి మంజూరు చేస్తున్న మూడు వేల రూపాయలను ఏడు వేల రూపాయలకు పెంచనున్నారు. మరి మన అధికారులు ఏ మేరకు ప్రజలకు అవగాహన కల్పిస్తారో వేచి చూద్దాం!

### ● ట్రాఫిక్‌ను నియంత్రించరు...

## జరిమానాలు వసూలు చేస్తారు!

నెల్లూరు నగరంలో రోజురోజుకు పెరిగిపోతున్న ట్రాఫిక్‌ను నియంత్రించాల్సిన పోలీసులు కేవలం జరిమానా విధించేందుకే పరిమితమై పోతున్నారు. ప్రతిరోజు ఉదయం, సాయంత్రం వేళల్లో నగరంలో ట్రాఫిక్ రద్దీగా ఉంటుంది. ప్రధాన కూడళ్లలో ట్రాఫిక్ సిగ్నల్స్ సక్రమంగా పనిచేయడం లేదు. దీంతో వాహనదారులు ఇష్టానుసారంగా వెళ్తుంటారు. రాకపోకలకు ఎటువంటి ఇబ్బంది లేకుండా పర్యవేక్షించాల్సిన ఎస్‌ఐలు ఆ బాధ్యతలను ట్రాఫిక్ పోలీసులకు అప్పగించి వారికి కేటాయించిన వాహనాల్లో నుంచే వాహన చోదకులను ఆపి జరిమానా, చలానాలు రాస్తున్నారు. ఒక ప్రక్క వాహనాల రాకపోకలు స్తంభించడం, మరోప్రక్క జరిమానా విధించేందుకు వాహనాలను నిలపడం ఇబ్బందికరంగా మారుతోంది. కెవిఆర్ పెట్రోల్ బంకు, ఆర్టీసి, మద్రాసు బస్టాండు, విఆర్‌సి, గాంధీబొమ్మ, కనకమహల్ సెంటర్, ఆత్మకూరు బస్టాండ్, రామలింగాపురం తదితర ప్రధాన కూడళ్లలో సాయంత్రం పూట ట్రాఫిక్ రద్దీ ఎక్కువగా ఉంటుంది. పై ప్రాంతాల్లో చలానాలు రాస్తున్న ఎస్‌ఐలు మనకెందుకులే అన్న విధంగా మౌనంగా ఉండిపోతున్నారు. ఎస్‌ఐలు వాహనాలను తనిఖీ చేయడంతోపాటు ట్రాఫిక్‌కు అంతరాయం కలగకుండా చూడాల్సిన అవసరం ఉంది.

# వారఫలాలు

తేది 17-03-2012 నుండి 23-03-2012 వరకు మేషంలో గురు, శుక్రులు; వృషభంలో కేతువు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో రాహువు; మీనంలో రవి, బుధులు; ధనుస్సు, మకర, కుంభ, మీనాలలో చంద్రుడు సంచరిస్తారు.



**మేషం**
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

చేసే పనులందు మిశ్రమంగా, ఆర్థిక లావాదేవీలలో సరిసమానంగా ఫలితాలుంటాయి. వ్యాపారస్తులు ఆచితూచి అడుగేయాలి. రుణాలు చేయవలసి రావచ్చు. బంధుమిత్రులతో విరోధాలు, అధిక ఖర్చులుంటాయి. విద్యార్థులకు చదువు పట్ల శ్రద్ధ అవసరం. వ్యవసాయదారులకు వ్యవహారపు చిక్కుల వల్ల మనశ్శాంతి తక్కువ. కళా, క్రీడా రంగాలలోని వారికి సామాన్యంగా వుంటుంది.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

ఆదాయానికి మించి ఖర్చుల వల్ల రుణాలు చేయవలసి రావచ్చు. పనులందు ఆటంకాలుంటాయి. కోర్టు వ్యవహారాలలో వాయిదా కోరుట మంచిది. కళా, క్రీడా రంగాలలోని వారికి తీవ్ర అసంతృప్తి, ఇబ్బందులు ఎదురౌతాయి. వ్యాపారస్తులు ధన విషయంలో జాగ్రత్తలు తీసుకోవాలి. ఉద్యోగస్తులు మౌనం పాటించుట మంచిది. పై అధికారులచే నిందలు వుంటాయి.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

చేసే పనులందు కొంత ఉపశమనం వుంటుంది. ప్రయాణాలందు జాగ్రత్త వహించాలి. అధిక ధనవ్యయం. ఊహించని సంఘటనలు జరుగుతాయి. సంతానం వల్ల సుఖసంతోషాలు పొందగలరు. వ్యవసాయ రంగంలోని వారు శ్రమకు తగ్గ ఫలితం పొందుతారు. కళా, క్రీడా రంగాలలోని వారికి మార్పుచేర్పులు, సర్దుబాట్లు అనుకూలిస్తాయి. రాజకీయ రంగంలోని వారికి బాగుంటుంది.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్రేష

పనులందు ఆటంకాలుండవు. ఉద్యోగస్తులకు స్థానచలనం, వ్యాపారస్తులకు కొన్ని ఇబ్బందులు తప్పవు. విద్యార్థులకు బాగుంటుంది. వ్యవసాయం రంగంలో వారికి అనుకూలం. కోర్టు పనులు వాయిదా వేసుకోవడం మంచిది. కళా, క్రీడా రంగాల వారికి చిక్కులు, చికాకులు తప్పవు. బంధుమిత్ర విరోధాలు, శరీరారోగ్య భంగం వుంటాయి. రాజకీయ రంగంలోని వారికి అనుకూలం.



**సింహం**
మఖ, పుబ్బ, ఉత్తర 1 పా

వీరు చేసే పనులందు అనుకోని సంఘటనలు జరిగి కొంత నష్టం కలుగుతుంది. అకారణ ప్రయాణాలతో ధన నష్టం, శరీర బాధలుంటాయి. విద్యార్థులకు బాగుంటుంది. వ్యవసాయదారులకు అనుకూలమైన కాలం. కోర్టు వ్యవహారాలలో అనుకూలతలు వుంటాయి. రాజకీయ రంగంలోని వారికి ఆర్థికంగా బాగున్నా మానసిక చికాకులు తప్పవు. ఆత్మస్థైర్యం అవసరం.



**కన్య**
ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

ఈ రాశి వారు చేసే పనులందు ప్రతికూలతలుంటాయి. తగిన శ్రద్ధ అవసరం. ఊహించని సమస్యలు, ఇబ్బందులు కలుగుతాయి. విద్యార్థులు ఒత్తిడి, ఆందోళన తగ్గించి చదువుపై శ్రద్ధ పెట్టాలి. వ్యవసాయం రంగంలోని వారికి ఆందోళన కలిగిస్తుంది. కళా, క్రీడా రంగాలలోని వారు మాట పట్టింపులకు పోక, తమ వృత్తి విషయాలపై శ్రద్ధ పెట్టాలి.



**తుల**
చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

వృత్తి, ఉద్యోగ, వ్యాపార రంగాలలోని వారికి శుభాశుభ ఫలితాలుంటాయి. కానీ గతం కంటే కొంత మేలు. శత్రువులు మిత్రులౌతారు. విద్యార్థులకు బాగుంటుంది కానీ ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. వ్యవసాయదారులకు ఆర్థికలాభాలున్నా, శరీర శ్రమ వుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి దూర ప్రయాణాలు అనుకూలిస్తాయి. రాజకీయ రంగంలోని వారికి అధిక శ్రమ వుంటుంది.



**వృశ్చికం**
విశాఖ 4 పా. అనూరాధ, జేష్ఠ

అధిక శ్రమతో పనులు పూర్తి చేస్తారు. వివాహాది శుభకార్యాలు అతి కష్టం మీద పూర్తి చేస్తారు. ధన నష్టం. సంతానానికి స్వల్ప అనారోగ్యం. విద్యార్థులు అధిక శ్రమతో విజయం సాధించగలరు. చికాకులధికం. కళా, క్రీడా రంగాలలోని వారికి పై అధికారులతో భేదాభిప్రాయాలు ఏర్పడగలవు. రాజకీయ రంగంలోని వారు ప్రయత్న పూర్వకంగా చేసిన పనులలో విజయం సాధించగలరు.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

తలపెట్టిన పనులు సకాలంలో పూర్తి చేయగలరు. వివాహాది శుభకార్యాలు నిశ్చయం కాగలవు. పుణ్యక్షేత్ర దర్శనం, తీర్థయాత్రలు చేస్తారు. దీర్ఘ ప్రయాణాల వల్ల అలసట, శ్రమ వుంటాయి. వ్యాపారస్తులకు ఆర్థికాదాయాలు సరిసమానంగా వుంటాయి. విద్యార్థులకు అనుకూలంగా వుంటుంది. ఉద్యోగులకు పై అధికారుల వల్ల ఏర్పడిన సమస్యలు పరిష్కారమౌతాయి. కార్యసిద్ధి, ధన లాభం.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

ఈ రాశి వారికి చాలా అనుకూలమైన వారం. అన్ని పనులలో విజయం సాధిస్తారు. నూతన వస్తు, వాహన, వస్త్రాభరణ ప్రాప్తి. ఉమ్మడి స్థిరాస్థి విషయాలపై శ్రద్ధ పెడతారు. విద్యార్థులు పరీక్షలలో విజయం సాధిస్తారు. వ్యవసాయదారులకు చాలా బాగుంటుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి నూతన పరిచయాలు, అధికారుల అనుకూలత వుంటుంది. రాజకీయ రంగంలోనివారికి అనుకూలం.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

పనులలో ఆటంకాలు, కుటుంబ సభ్యులతో మాట పట్టింపులు, మానసిక ఒత్తిడి వుంటాయి. ఉద్యోగులకు పై అధికారుల చికాకులు, నిందలు ఎదురౌతాయి. వ్యవసాయ రంగంలోని వారికి సన్నిహితుల సహకారం లభిస్తుంది. కళా, క్రీడా రంగాలలోని వారికి ముఖ్యుల పరిచయం ఆర్థికపుష్టిని కలిగిస్తుంది. రాజకీయ రంగంలోని వారికి కార్యకర్తలలో వచ్చిన మార్పులు ఆందోళన కలిగిస్తాయి.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

చేసే పనుల మీద శ్రద్ధ వహించవలెను. శరీరారోగ్య లోపం, ధన నష్టం వుంటుంది. ఇతరులతో మాట పట్టింపులు, విరోధాలు పనికిరావు. గృహసంబంధ పనులు పూర్తి చేస్తారు. ఆకస్మిక ప్రయాణాల వల్ల త్రిప్పట, అలసట వుంటుంది. వ్యవసాయం చేసే వారికి ఆర్థికాదాయం వుంటుంది. కళా, క్రీడా రంగాలలోనివారు సంతృప్తి పొందగలరు. ఆకస్మిక ధన, పదవీ లాభాలు పొందగలరు.

## పంచాంగం

20తేది మేషాయనం – ఆయన ప్రియుక్త విషవత్పు పుణ్యకాలం ప.10.44 ని॥లకు. త్రయోదశి తిథి.
22తేది పిత్రుయజ్ఞ – పితృతర్పణం.
23తేది శ్రీ నందన నామ నూతన సంవత్సరం ప్రారంభం. ఉగాది పండుగ.

### శుభ ముహూర్తాలు

17, 18తేదీలలో వివాహ, ఉపనయన, అక్షరాభ్యాస, అన్నప్రాసన, గృహారంభ, గృహప్రవేశాలకు సుముహూర్తాలున్నాయి.

### మార్చి తిథులు

**ఫాల్గుణ బహుళ**

| | | | |
|---|---|---|---|
| 17 | శని | దశమి | సా 04.40 గం.ల.వ |
| 18 | ఆది | ఏకాదశి | సా 04.32 గం.ల.వ |
| 19 | సోమ | ద్వాదశి | సా 04.49 గం.ల.వ |
| 20 | మంగళ | త్రయోదశి | సా 05.30 గం.ల.వ |
| 21 | బుధ | చతుర్దశి | సా 06.36 గం.ల.వ |
| 22 | గురు | అమావాస్య | రా 08.05 గం.ల.వ |

**చైత్ర శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| 23 | శుక్ర | పాడ్యమి | రా 09.59 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, డిఎస్ఆర్ నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.

# వయ్యారి భామలా వాస్తుదోషాలు నిర్మూలించాలి!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పి.వి.జగదాంబ — నెల్లూరు*

** 'వృక్షవేధ' అన్నారు కదా? మానవులకు అపకారం చేసే మొక్కలు తీసివేస్తే దోషమా?*

మొక్కల్లో 'వయ్యారిభామ' సర్వరోగాల్ని కలిగిస్తుంది. వాస్తు దోషాలలాగే ఈ మొక్కను కూడా గృహ ప్రాంతాల్లో నిర్మూలించాలి. ఎలాంటి దోషమూ అంటదు.

*కె.అరుంధతీరెడ్డి — చెన్నై*

** 'వ్యాధి శృంఖలం' అని వశిష్ఠ వాస్తులో చాలా శ్లోకాలున్నాయి. ఆ మొక్క ఏమిటి?*

వశిష్ఠ వాస్తులో 'రుగ్వపూర్ణ' అని ఉంది. మీ వివరణ సరికాదు. ఇది కలుపు మొక్క 'వయ్యారి భామ'ను గురించే! ఇది శ్వాసకోశ వ్యాధులు, క్యాన్సర్ లాంటి రోగాల్ని కలుగజేస్తుంది.

*డాక్టర్ అభిరామ్ — సికింద్రాబాద్*

** మతగ్రంథాలు స్త్రీని కట్టు బానిసను చేశాయి.*

భారతీయ వేదంలో స్త్రీ సమానత్వం, స్త్రీ పునర్వివాహం వంటి అభ్యుదయ భావాలున్నాయి. శాస్త్రాలు గొప్పవే. మనుషులు స్వార్థంతో కొన్ని నియమ నిబంధనలు సృష్టించారు.

*సి.ఉమాకాంతారావు — సికింద్రాబాద్*

** వీధిపోటు ఉన్నప్పుడు, వినాయక విగ్రహమా? యంత్రమా ఏది మేలు?*

దేనికి సంబంధించిన పూజలు దానికున్నాయి. మీరు 'యంత్రమే' ప్రతిష్టించుకోండి. 'కుంభప్రతిష్ట' అవసరం లేదు.

*తెన్నె రమ్య — హైదరాబాద్*

** వాస్తు విధివిధానాలు 'ప్లాటు'లో ఎలా పాటించాలి?*

ప్లాటు నిర్మాణ సమయానికి ముందు చెబితే 'బీమ్స్' వేసి కట్టుబడి విధానం మార్చుకొంటే దాన్ని వాస్తు ప్రకారం సరిచేయవచ్చు.

*జద్దర్ల అరుణ — కర్నూలు*

** గ్రామ నిర్మాణాలకు వాస్తు ఉందా?*

ఉంది. వశిష్ఠ, నారద, జైమిని వాస్తు గ్రంథాల్లో 'గ్రామ నిర్మాణ' రీతులు వర్ణించబడ్డాయి.

*జె.దివోదాసు — గుడివాడ*

** దక్షిణం వీధి, తూర్పు, పడమరల ఇళ్లు. తీసుకోమంటారా?*

వీధి ఒకవైపు, గృహం ఒకవైపు ఉంటే 'దిశా భ్రష్టత' ఏర్పడి పిల్లలు భ్రష్టులవుతారు.

*ఎన్.అహ్మద్‌పఠాన్ — నవాబుపేట*

** పిల్లల అనారోగ్యం, చదువులో వెనుకబడి ఉండటం. ఇత్యాది కారణాలకు పరిష్కారం చెప్పండి?*

గృహంలో కుండీలలో అయినా సరే తులసి మొక్కల్ని పెంచండి. ఇది మెదడుకు పదును పెడుతుంది. వివరాలు పంపితే యంత్రమూ, రత్నమూ చెబుతాను.

*షేక్ షానవాజ్ — బెంగుళూరు*

** 'విదిక్కుల ఇల్లు' అంటే అర్థం చెప్పండి?*

రోడ్డు ఒక దిక్కుల్లో, ఇంటి నిర్మాణం మరో దిక్కుల్లో ఉన్నప్పుడు 'విదిక్ నిర్మాణం' అంటారు. ఈ గృహంలో ఎప్పుడూ ఆర్థిక, అనారోగ్య సమస్యలుంటాయి.

*బి.అనవేములశెట్టి — కనిగిరి*

** సమస్యలు చుట్టుముడితే ఈశాన్య కుంభ ప్రతిష్ఠే శ్రేష్ఠమని గురువు చెప్పారు?*

ఈశాన్య కుంభ ప్రతిష్ఠ శాస్త్రవిధి నిష్ణాతులైన వ్యక్తి చేయాలి. అలాంటి వారు అరుదు. అందువల్ల 'నరఘోష' యంత్రం ప్రతిష్టించుకొంటే సరిపోతుంది.

*శేముషి రత్నప్రభ — బెంగుళూరు*

** పౌర్ణమినాడు వెన్నెల్లో పాలగిన్నెలో రుద్రాక్షవేసి త్రాగితే రోగాలు నివారిస్తాయంటారు నిజమేనా?*

నిజమే! అయితే నామాక్షరాన్ని బట్టి రుద్రాక్షను, రాశిని బట్టి రాయినీ నిర్ధారించాలి. ఒకసారి కలవండి. వివరాలు చెబుతాను.

*జె.అమృతరావు — మదనపల్లి*

** ఏ మందులూ పనిచేయకపోతే మీరు చెప్పిన వృక్షపు బెరడు అద్భుతంగా పనిచేసింది.*

శాస్త్రరీత్యా ఈ విధానం 'సైన్స్'కు పెద్ద సవాలుకానుంది. నక్షత్ర రాశియుక్తంగా వచ్చే చెట్టు 'ఔషధయుక్తం' రోగనిదాన దేవత అంటారు భరద్వాజ మహర్షి.

# రోడ్లెందుకు వేయరో అర్థం కావడం లేదు!



బాగా దెబ్బతినిపోయిన ముంబాయి - బుచ్చి రోడ్డు.

ప్రజాప్రతినిధుల ఉదాసీనత, అధికారుల నిర్లక్ష్యం కారణంగా జిల్లాలోని పలు రోడ్లు అభివృద్ధికి నోచుకోలేకపోతున్నాయి. 2011-2012 ఆర్థిక సంవత్సరానికి సంబంధించి జిల్లా వ్యాప్తంగా రోడ్లు, భవనాలశాఖ పరిధిలోని రోడ్ల నిర్మాణానికి 125కోట్ల రూపాయలు ప్రభుత్వం మంజూరు చేసింది. ఈ నిధులతో రోడ్లను నిర్మించాల్సిన సంబంధితశాఖ అధికారులు ఏ కారణం చేతనో చేతులెత్తేశారు. జిల్లాకు నిధులు మంజూరైన విషయం ప్రజాప్రతినిధులకు తెలిసినా కూడా రోడ్ల నిర్మించేందుకు ఎటువంటి ప్రయత్నాలు చేయలేదు.

మంజూరైన నిధులను ముందుగా కేటాయించిన పనులకు కాకుండా ఇతర పనులకు ఖర్చు చేశారు. దీంతో ఆర్థిక సంవత్సరం ముగిసేలోగా 125కోట్లను ఎలాగైనా ఖర్చు చేయాలని అధికారులు భావిస్తున్నారు. ఇందులో భాగంగానే ముత్తుకూరు రోడ్డులో నెల్లూరు-కాకుపల్లి మధ్య నాలుగులైన్ల రోడ్డు పనులను యుద్ధప్రాతిపదికన చేపట్టారు. గత సంవత్సరం ఈ రోడ్డు పనులు ప్రారంభించాల్సిన అధికారులు రాజకీయ జోక్యం కారణంగా ప్రారంభించలేకపోయారు. జిల్లాలో కోవూరు ఉప ఎన్నిక జరుగనున్న దృష్ట్యా ఎన్నికల కోడ్ అమల్లో వున్నప్పటికి రోడ్డు నిర్మాణ పనులు మాత్రం యధావిధిగా కొనసాగుతున్నాయి. ఈ పనులను మరో 15రోజుల్లోగా పూర్తి చేయాలన్నది అధికారుల లక్ష్యం.

**నాలుగు, ఆరులైన్ల గురించి ఊసేలేదు.**

నగరంలోని మినీబైపాస్ రోడ్డును ఆరు లైన్లుగానూ, ఇరుగాళమ్మ దేవస్థానం నుంచి జొన్నవాడ వరకు వున్న రోడ్డు నాలుగు లైన్లుగాను విస్తరించాలని ప్రతిపాదనలు రూపొందించారు. ఇందుకోసం సర్వే కూడా పూర్తి చేశారు. అయితే నిర్మాణ పనులు మాత్రం ప్రారంభం కాకుండా నిలిపివేశారు. ఏ కారణం చేత పై రెండు రోడ్ల నిర్మాణ పనులు నిలిపివేశారన్నదానిపై స్పష్టమైన సమాధానం చెప్పేందుకు సంబంధిత శాఖ అధికారులు వెనుకంజ వేస్తున్నారు.

ప్రభుత్వం మంజూరు చేసిన 125కోట్లతోనే పై పనులు కూడా చేపట్టాల్సి వుంది. ప్రజాప్రతినిధుల ఆదేశాల మేరకు రోడ్ల మరమ్మత్తుల కోసం నిధులు ఖర్చు చేశారన్న ఆరోపణలు వున్నాయి. ప్యాచ్ వర్క్ పేరుతో అవసరం వున్నా లేకపోయినా లక్షలాది రూపాయలు ఖర్చు చేశారు. ఒకసారి చేసిన ప్యాచ్‌వర్క్ కొద్ది రోజులకే తిరిగి యధాస్థితికి చేరుకొంటున్నాయి. కమీషన్ల కోసం కక్కుర్తిపడి ఇటువంటి పనులకు ప్రాధాన్యతనిస్తూ శిథిలావస్థకు చేరిన రోడ్ల గురించి అసలు పట్టించుకోవడం మానేశారు.

> 2011-12 ఆర్థిక సంవత్సరంలో జిల్లావ్యాప్తంగా దెబ్బతిన్న రోడ్ల పునర్నిర్మాణానికి రోడ్లు, భవనాల శాఖకు ప్రభుత్వం 125 కోట్ల రూపాయలు మంజూరు చేసినా ఈ నిధులు ఖర్చు చేయడంలో ఆ శాఖాధికారులు ఉదాసీన వైఖరి ప్రదర్శించారు.

రోడ్లు సక్రమంగా లేకపోవడంతో వాహన రాకపోకలకు తీవ్ర ఆటంకం ఏర్పడుతుంది. ఇప్పటికైనా జిల్లాలోని ప్రజాప్రతినిధులు స్పందించి శిథిలావస్థకు చేరిన రోడ్లను నిర్మించేందుకు తమవంతు కృషి చేయాల్సిన అవసరం వుంది.

రిపేర్లు చేయించరా?

# తాగునీటి బోర్ల నిర్వహణ... మరమ్మత్తులు లేవు!



జిల్లాలో త్రాగునీటి బోర్ల నిర్వహణ, మరమ్మత్తుల కోసం ప్రవేశపెట్టిన క్రాష్ ప్రోగ్రామ్ అటకెక్కింది. గ్రామీణ నీటి సరఫరా విభాగం ఆధ్వర్యంలో తాగునీటి అవసరాలు తీర్చేందుకు గత సంవత్సరం రాష్ట్ర ప్రభుత్వం క్రాష్ ప్రోగ్రామ్ ప్రవేశపెట్టింది. నూతన సాంకేతిక పరిజ్ఞానంతో తయారుచేయబడిన యంత్ర పరికరాలను జిల్లాకు పంపినప్పటికీ వాటిని ఆర్‌డబ్ల్యుఎస్ విభాగం ఇంజనీర్లు ఎక్కడా వినియోగించిన దాఖలాలు కనిపించడం లేదు. తాగునీటి ఎద్దడి వున్న గ్రామాలను ముందుగా గుర్తించి కొత్తగా వచ్చిన మిషన్ ద్వారా నీరు ఎక్కడ పడుతుందో నిర్ధారించాల్సి వుంటుంది. మిషన్ సహకారంతో కొత్త బోర్లను వేయడంతో పాటు పాత బోర్లకు మరమ్మత్తులు చేయాలన్నది ప్రభుత్వ సంకల్పం. గత సంవత్సరం సాంకేతిక పరిజ్ఞానంతో కూడిన 11 మిషన్లు జిల్లాకు చేరాయి. వీటిని డివిజన్ల వారీగా అధికారులు పంపిణీ చేయడం జరిగింది. డిఇ స్థాయి అధికారి పర్యవేక్షణలో మిషన్లు వినియోగించాలి. లక్షలాది రూపాయల వ్యయం చేసి కొనుగోలు చేసిన మిషన్లు కార్యాలయాల్లో మూలనపడి వున్నాయి. వేసవి కాలంలో తాగునీటి సమస్య తీవ్రంగా వుంటుందని హెచ్చరికలు అందుతున్నా ఈ విభాగం అధికారుల్లో ఏ మాత్రం స్పందన కానరావడం లేదు.

జిల్లాకు వచ్చిన మిషన్లను వినియోగించకుంటే అవి పూర్తిగా చెడిపోయే అవకాశం వుంటుందని ఆ శాఖ సాంకేతిక సిబ్బంది అంటున్నారు. ఇప్పటికే జిల్లా వ్యాప్తంగా వందలాది తాగునీటి బోర్లు శిథిలావస్థకు చేరాయి. వీటికి మరమ్మత్తులు చేయాల్సిన అధికారులు గ్రామ పంచాయితీలపై నెట్టివేస్తున్నారన్న విమర్శలు వున్నాయి. గ్రామ పంచాయితీల్లో అవసరమైన నిధులు లేవని కార్యదర్శులు తప్పుకొంటున్నారు. తాగునీటి సమస్యను పలు దఫాలుగా అధికారుల దృష్టికి తీసుకెళ్లిన గ్రామీణ ప్రాంత వాసులు అధికారుల వైఖరితో విసుగుచెంది గత్యంతరం లేక వాటర్ క్యాన్లను కొనుగోలు చేసి దాహార్తి తీర్చుకుంటున్నారు.

> ప్రజల త్రాగునీటి అవసరాలు తీర్చేందుకు గత ఏడాది రాష్ట్ర ప్రభుత్వం క్రాష్ ప్రోగ్రామ్‌ను ప్రవేశపెట్టింది సాంకేతిక పరిజ్ఞానంతో కూడిన పరికరాలు పంపినప్పటికీ వాటిని ఆర్‌డబ్ల్యుఎస్ అధికారులు ఉపయోగించలేదు.

## నిధులు లేక ఆగిన పనులు

గ్రామీణ నీటి సరఫరా విభాగం అధికారులు జిల్లాలో దాదాపు 70 కోట్ల రూపాయల పనులు చేపట్టారు. గ్రామీణ ప్రాంతాల్లో తాగునీటి అవసరాలు తీర్చేందుకు ఓవర్‌హెడ్ ట్యాంకుల నిర్మాణం చేపట్టారు. అయితే తొలుత పనులు ప్రారంభించిన అధికారులు పనులు పూర్తిచేసిన కాంట్రాక్టర్లకు బిల్లులు చెల్లించలేక పోతున్నారు. రాష్ట్ర ప్రభుత్వం నుంచి నిధులు విడుదల కాకపోవడంతో అధికారులు సైతం ఏం చేయలేక పోతున్నారు. మరో ప్రక్క కాంట్రాక్టర్లు చేసిన పనులకు బిల్లులు చెల్లిస్తే మిగిలిన పనులు పూర్తి చేస్తామని చెబుతున్నారు. ప్రభుత్వం, కాంట్రాక్టర్ల మధ్య గ్రామీణ ప్రజలు తీవ్ర ఇక్కట్లు పడక తప్పడం లేదు. రెండు సంవత్సరాల క్రితం ప్రారంభించిన పనులు నేటికీ పూర్తి కాకుండా ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని వెక్కిరిస్తున్నాయి. ఇప్పటికైనా ప్రజాప్రతినిధులు వారి వారి నియోజకవర్గాల్లో అసంపూర్ణంగా నిలిచిపోయిన సమ్మర్ స్టోరేజ్ ట్యాంకు నిర్మాణ పనులను పూర్తి చేయించేందుకు కృషి చేస్తే బాగుంటుంది.

# మిస్టర్ నూకయ్య వీక్!

అల్లూరు రహీం

నటుడు మోహన్‌బాబు చిన్న కుమారుడు మంచు మనోజ్ ఇప్పటివరకు చాలా చిత్రాల్లో నటించినా ఆయనకు బ్రేకిచ్చిన చిత్రం ఒక్కటీ లేదు. కొరియన్ చిత్రాలు బాగా చూసే అలవాటున్న మనోజ్ ఆ ప్రభావంతో నటించిన చిత్రం మిస్టర్ నూకయ్య. ఈ చిత్రంలో ఆయన నటించడంతోపాటు పాటలు వ్రాశాడు. ఫైట్స్ చేశాడు. డ్యాన్స్‌ను కంపోజ్ చేసి, యాక్షన్ సన్నివేశాల రూపకల్పనలో పాలు పంచుకొన్నాడు. ప్రేక్షకులను అలరించను 12 గెటప్పులలో వెండితెరపై కనిపించినా ప్రయోజనం లేకుండా పోయింది. దీనికి కారణం మిస్టర్ నూకయ్యలో హృదయాన్ని తాకే కథ లేకపోవడమే. ఈ సినిమాలో వచ్చే రెండవ పాటను చిత్రీకరించిన తీరు అర్ధం చేసుకోను తెలుగు ప్రేక్షకులు కాస్త గందరగోళపడాల్సి వస్తోంది. ప్రథమార్ధంలో చాలా సన్నివేశాల్లో గ్రాఫిక్స్‌ను వాడారు. ఈ చిత్రంలో యువన్ శంకర్ రాజా సంగీతమందించినా పాటలు చెప్పుకోదగ్గట్టు లేవు. ఒకరికి ఇద్దరు హీరోయిన్లు వున్నా వాళ్లు ప్రేక్షకులను ఆకట్టుకొనే అవకాశం లేని వాళ్లు కావడం ఈ చిత్రానికి పెద్ద లోపమనవచ్చు. మిస్టర్ నూకయ్యకు కథతోపాటు స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు కూడా నడిపిన అని కన్నెగంటికి సినిమాలో ప్రేక్షకులు మెచ్చే అంశాలేమిటన్న దానిపై అసలు అవగాహన లేనట్లుంది. ఒకటవ రీలు నుంచి చివరి రీలు వరకు గందరగోళంగా తీసి పారేశాడాయన. దర్శకుడు, నిర్మాతలలో ఎవరు ప్రేమలో దెబ్బతిన్నారో కాని ప్రియురాళ్లను గలీజు మనుషులుగా చిత్రీకరించడంతోపాటు వారిని అమ్మనా బూతులు తిట్టే సన్నివేశాలు కోకొల్లలు. ఓ సన్నివేశంలో మహిళల మానంపై హీరో చేసే బేవార్సు కామెంట్‌ను సెన్సార్ అనుమతించడం కన్నా నీచమైన విషయం ఇంకొకటి లేదు. ఓ మహిళా బ్యాంక్ మేనేజర్ తన బ్యాంకు నుంచి రెండుకోట్లు తరలించి వేస్తే దీనిపై విచారించేవారు లేకుండా పోతారా? పరుచూరి బ్రదర్స్ వ్రాసిన డైలాగుల్లో కష్టాలు లేకుండా మనిషి లేడు. ప్రేమ ఎప్పుడూ గొప్పదే వంటివి జన సామాన్యం నుంచి తీసుకొని వ్రాసినట్లుంది.




చిత్ర కథలోనికి వెళ్తే నోకియా (మంచు మనోజ్) అసలు పేరు నూకయ్య. ఇతనో అనాధ. ఇతన్ని నాంపల్లి(పరుచూరి వెంకటేశ్వరరావు) చేరదీసి పెద్దవాడిని చేస్తాడు. ఛార్జర్ (వెన్నెల కిషోర్) తో కలసి నోకియా సెల్‌ఫోన్ల దొంగతనం చేస్తుంటాడు. వాటిని బహిరంగ మార్కెట్‌లో తక్కువ రేట్లకు విక్రయించేస్తుంటాడు. అనూరాధ (కృతిక కర్బందా) ఓ బ్యాంక్ మేనేజర్. ఈమె కూడా అనాధ. ఈమె ఇంకో అనాధ కిరణ్(రాజా)ను ప్రేమించి పెళ్లి చేసుకొంటుంది. పెళ్లి కాగానే కిరణ్‌ను షాజహాన్(మురళీకృష్ణ) కిడ్నాప్ చేస్తాడు. తనకు రెండు కోట్ల రూపాయలు ఇస్తే అతన్ని వదలుతానని ఎం.ఎం.ఎస్. ఇస్తాడు. మరో మార్గాంతరం లేని అనూరాధ బ్యాంక్‌లోని డబ్బు సూట్‌కేసులో పెట్టుకొని జనావాసం లేని రైల్వే స్టేషన్‌కు వెళ్లి నిలుచుంటుంది. ఇక్కడ ఈమె ఫోన్‌ను నోకియా తస్కరిస్తాడు. ఆ ఫోన్‌కొచ్చే కాల్ ఆధారంగా విషయాన్ని పసిగట్టి రెండుకోట్లు కాజేసి తన ప్రియురాలు శిల్ప(సనాఖాన్) దగ్గరకు వెళ్లగా ఆమె వేరేవాడితో కులుకుతూ వుంటుంది. గుండె బద్దలైన నోకియా బయటకు వచ్చేసరికి అతని మిత్రుడు ఛార్జర్ రెండు కోట్ల రూపాయలు తీసుకొని ఉడాయించి మరో షాక్ ఇస్తాడు. డబ్బు పోవడంతో అనూరాధ చెరువులో దూకుతుంది. హృదయం బద్ధలైన నోకియా అక్కడ మందు కొడుతూ ఇది చూసి ఆమెను రక్షిస్తాడు. కిరణ్‌ను రక్షించను షాజహాన్ డెన్‌కు వెళ్లగా అక్కడ అతనో మోసగాడని తెలుస్తుంది. చేతులు మారిన డబ్బు మళ్లీ అనూరాధ చేతికి చిక్కడంతో సంతోషించిన ఆమె నోకియాకు షాపు పెట్టుకోను లోన్ ఇవ్వడంతో చిత్రం ముగుస్తుంది.

ఈ చిత్రం కోసం హీరో మంచు మనోజ్ ఒళ్లు విరుచుకొని కష్టపడ్డా ఫలితం దక్కలేదు. ఈ చిత్రంలో మిగతా పాత్రలు, పాత్రధారుల గూర్చి చెప్పుకోవాల్సింది ఏమీ లేదు.

## హద్దులు దాటను



బాలీవుడ్ హాట్‌హాట్ భామల్లో మల్లికా శెరావత్‌ది మొదటి వరుస. హిస్, పాలిటిక్స్ ఆఫ్ లవ్ చిత్రాలతో హాలీవుడ్‌కు పరిచయమయ్యింది. లక్కీ అన్‌లక్కీ చిత్ర షూటింగ్ గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడుతూ శృంగార తారగా గుర్తింపు తెచ్చుకోవడం అంత సులువేం కాదు. ఏ పని చేసినా క్రమశిక్షణ చాలా అవసరం. నా దినచర్య ఓ పద్ధతిలో సాగుతుంది. నేను పార్టీలకు వెళ్లను. ఒక వేళ వెళ్లినా మద్యం, ధూమపానాలకు దూరంగా వుంటాను. నా ఒంపుసొంపులు కనిపించేలా దుస్తులు ధరిస్తాను. కావల్సినంత శృంగారం ఒలకబోస్తాను. ఇదంతా సినిమాల్లోనే. నేను బయట కూడా అలానే ఉంటాను. సెక్స్‌కి ఎలాంటి అడ్డు చెప్పను అనుకొంటే మాత్రం పొరపాటే. వ్యక్తిగతంగా నాకంటూ కొన్ని హద్దులు ఉన్నాయి. వాటిని ఎప్పుడూ దాటనంది.

## తమిళ చిత్రంలో అల్లు అర్జున్!



తమిళంలో మార్కెట్ ఎలా సంపాదించుకోవాలి? అక్కడి ప్రేక్షకుల్ని ఎలా ఆకట్టుకోవాలి? ప్రస్తుతం మన తెలుగు హీరోల ఆలోచన సరళి ఇలా వుంది. సూర్య, కార్తీ లాంటి వాళ్లు ఇక్కడ ప్రతాపం చూపిస్తున్నారు. ఆ స్ఫూర్తితో మనవాళ్లు కూడా అక్కడ అడుగుపెట్టే ప్రయత్నాల్లో వున్నారు. ఇప్పటివరకు డబ్బింగ్ సినిమాలతో సరిపెట్టుకున్నా... ద్విభాషా చిత్రాలతో ప్రేక్షకుల మనసుల్ని గెలుచుకొనే ప్రణాళికలు సిద్ధం చేసుకొంటున్నారు. ఈ విషయంలో అల్లు అర్జున్ అందరికంటే ముందున్నాడు. ఈయనకు కేరళలోనూ అభిమానులున్నారు. అయితే ఇప్పుడు తమిళ పరిశ్రమవైపు దృష్టి నిలిపారు. ఈ విషయమై ఆయన మాట్లాడుతూ తమిళంలో ఓ సినిమా చేయాలని ఎప్పటి నుంచో అనుకొంటున్నా... ఆ ప్రయత్నాలు ఇప్పుడిప్పుడే ఓ కొలిక్కివస్తున్నాయి. దర్శకుడు సెల్వ రాఘవన్ కొన్ని కథలు వినిపించినట్లు చెప్పారు.

## మళ్లీ జత కట్టారు



పూలరంగడు చిత్రంలో మెరిసిన జంట సునీల్ – ఇషా చావ్లా. వీరిద్దరూ మరోసారి జతకట్టబోతున్నారు. బాలీవుడ్‌లో ఘన విజయం సాధించిన చిత్రం 'తను వెడ్స్ మను' తెలుగులో సునీల్ కథానాయకుడిగా తెరకెక్కించబోతున్నారు. దేవి ప్రసాద్ దర్శకుడు. కథానాయికగా ఇషాచావ్లాను ఎంచుకొన్నారు. పూలరంగడు సినిమా కంటే ముందు మొదలు కావాల్సిన సినిమా ఇది. కథానాయిక పాత్ర చాలా కీలకం. కొత్తమ్మాయిని ఎంచుకొనే బదులు కొంచెం అనుభవం ఉన్న నాయికైతే బాగుంటుందనిపించింది. అందుకే ఇషాను తీసుకొన్నామని దర్శకుడు దేవి ప్రసాద్ చెప్పారు.

## ఐటెం పాటలు చేయను!



హిందీ చిత్రాల్లో ఐటెం పాటలకు భలే డిమాండ్. హీరోయిన్ తెరపై కనిపించడం ద్వారా ఎంత గుర్తింపు దక్కుతుందో ఓ ఐటెంపాటలో నర్తించినా అంతే పేరొస్తుంది. మున్నీకి బద్నామ్, షీలాకీజవానీ, చిక్నీచమేలీ పాటలకు లభించిన ఆదరణ దృష్ట్యా అగ్ర కథానాయికల చూపు ప్రత్యేక గీతాలపై మళ్లిందిప్పుడు. అయితే ఇటువంటి మంచి అవకాశాన్ని సమీరారెడ్డి వదలుకొంది. తేజ్ సినిమాలో ఐటెంపాటకు నర్తించమని సమీరాను అడిగితే చేయనందట. దీంతో ఈ అవకాశం మల్లిక శెరావత్‌కెళ్లింది. ఐటెం పాటల్లో నర్తించడం తనకు అయిష్టమంటుంది సమీరా.

## అలాంటిదేమీ లేదు!



విష్ణు–హన్సిక జంటగా జి.నాగేశ్వరరెడ్డి దర్శకత్వంలో ఓ చిత్రం రూపొందుతుంది. ఈ సినిమా చిత్రీకరణ సమయంలో హన్సిక, విష్ణుకూ మధ్య స్నేహ బంధం పెనవేసుకొందన్న పుకార్లు షికార్లు చేస్తున్నాయి. హన్సిక శ్రీశైలం గుడికి వెళ్తే అక్కడ ఏర్పాట్లన్నీ విష్ణునే దగ్గరుండి చేశాడని, దీనికితోడు హన్సిక బాగా ఒళ్లు తగ్గేలా జాగ్రత్తలు తీసుకొన్నాడట. తన ఇంటి నుంచే ఆమెకు క్యారియర్ భోజనం తెప్పించడం, షూటింగ్ అయ్యాక చక్కర్లు కొట్టడంతో దుమారం ఎక్కువయ్యింది. హన్సిక, విష్ణు మాత్రం ఇటువంటి వార్తలు పుట్టించేవే అంటున్నారు. ఫోనులో మాట్లాడడం, కలసి వుండడం ఎలా తప్పని ప్రశ్నిస్తున్నారు.

● రంగడి రథోత్సవానికి

# పోటెత్తిన జనం!

● ఏటికేడాదికి

పెరిగి పోతున్న భక్తులు


గోపురం వీధిలో రథోత్సవం.

తల్పగిరి రంగనాథస్వామి రథోత్సవం భక్తజన సందోహం నడుమ అంగరంగ వైభవంగా జరిగింది. మార్చి 10వ తేదీన జరిగిన ఈ కార్యక్రమంలో జిల్లా నలుమూలల నుంచేకాక తమిళనాడు రాష్ట్రం నుంచి పెద్ద ఎత్తున భక్తులు విచ్చేసి రంగడిని దర్శించుకొన్నారు. వార్షిక బ్రహ్మోత్సవాల్లో భాగంగా నిర్వహించిన ఈ రథోత్సవంలో భక్తులు శ్రీరంగనాథ అంటూ పారవశ్యంతో కీర్తించారు. శ్రీదేవి, భూదేవి సమేతుడైన రంగనాథుడికి మొదట నిర్వహించాల్సిన పూజాది కార్యక్రమాలు చేసిన అనంతరం ప్రధాన అర్చకులు కిడాంబి జగన్నాధాచార్యులు రథోత్సవానికి సిద్ధం చేశారు. జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి జెండా ఊపి, గుమ్మడికాయ దిష్టితీసిన అనంతరం రథోత్సవం ప్రారంభమైంది. ఈ సందర్భంగా భక్తుల కోలాటాలు, నృత్యాలు ఆకట్టుకొన్నాయి. గత అనుభవాలను దృష్టిలో ఉంచుకొని ఎలాంటి అవాంఛనీయ సంఘటనలకు తావు లేకుండా పోలీస్ గట్టి బందోబస్తు చర్యలు చేపట్టింది. సంతపేట నాలుగు కాళ్ల మండపం వద్దకు రథం చేరుకొన్న తర్వాత ఆయనకు వేదగిరి నరసింహస్వామి, ఆదిలక్ష్మి అమ్మవార్లు ఎదురేగడంతో ఎదురుకోలు కార్యక్రమాన్ని నిర్వహించారు. ఈ సందర్భంగా భక్తులు ఉప్పు, మిరపకాయలను రథంపై చల్లడంతోపాటు గుమ్మడికాయలు రథం క్రిందవేసి తమ మొక్కులు తీర్చుకొన్నారు.

# రుణ బకాయిదారుల ఫోటోలు విడుదల

జిల్లాలోని వివిధ బ్యాంకుల్లో రుణ బకాయిదారుల ఫోటోలను అధికారులు విడుదల చేశారు. ప్రతి సంవత్సరం మార్చి నెలాఖరుకు నిర్దేశించిన బకాయిలను బ్యాంకు అధికారులు వసూలు చేయాల్సి ఉంటుంది. గతంలో బకాయిదారులకు డిమాండ్ నోటీసులు పంపడం, అప్పటికీ స్పందించకుంటే కోర్టు ద్వారా బాకీపడ్డ సొమ్మును వసూలు చేసుకునేవారు. అయితే ఈ ఆర్థిక సంవత్సరం నుంచి లక్ష రూపాయలకు మించి రుణ బకాయిదారుల జాబితాతోపాటు వారి ఫోటోలను సైతం ప్రకటనలుగా విడుదల చేసేందుకు శ్రీకారం చుట్టారు. ఈ కొత్త విధానం కారణంగా పత్రికల్లో ఫోటోలు రావడంతో బకాయిదారులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. వివిధ వ్యాపారాల నిమిత్తం బ్యాంకుల నుంచి రుణాలు పొంది వ్యాపారంలో నష్టం రావడంతో తిరిగి రుణాలు చెల్లించని వారు అనేక మంది ఉన్నారు. పరువు, ప్రతిష్టలుగల వారి ఫోటోలు సైతం విడుదల కావడం సమాజంలో అందరికీ తెలిసి మొండి బకాయిదారులుగా ముద్రపడుతుందని అభిప్రాయపడుతున్నారు. కొందరు బ్యాంకులకు వెళ్లి కొంత గడువు ఇస్తే బకాయిలను వాయిదా పద్ధతిలో చెల్లిస్తామంటూ రాతపూర్వకంగా హామీ ఇస్తున్నారు. బ్యాంకు అధికారులు తీసుకున్న ఈ నిర్ణయం ఎంతమేరకు ఫలితం ఇస్తుందో చూడాలి.

# యువకిరణాలకు ఐదువేలు జీతం!

రాజీవ్ యువ కిరణాల పథకం ద్వారా ప్రైవేటు సంస్థల్లో ఉద్యోగం చేసే వారికి కనీస వేతనం ఐదువేల రూపాయలుగా ప్రభుత్వం నిర్ణయించింది. ఈ పథకం ద్వారా ఎంపికైన ఉద్యోగులకు నెలసరి వేతనం తక్కువగా చెల్లిస్తుండడంతో రెండు, మూడు నెలలకే ఉద్యోగాలను మానేస్తున్నారు. ప్రైవేటు సంస్థల్లో పని అధికం కావడం, చెల్లించే వేతనం సరిపోకపోవడంతో నిరుద్యోగులు ఆసక్తి చూపడం లేదు. రాజీవ్ యువ కిరణాల ద్వారా వేలాది మందికి ఉద్యోగ, ఉపాధి అవకాశాలు కల్పించామని అధికారులు ప్రకటనలు చేస్తున్నా వాస్తవ పరిస్థితులు ఇందుకు భిన్నంగా ఉంటున్నాయి. రాష్ట్ర ప్రభుత్వం జరిపిన పరిశీలనలో ఈ విషయం వెల్లడి కావడంతో అధికారులు చెప్పిన లెక్కలు అవాస్తవమని తేలింది. ఇక నుంచి కొత్తగా ఎంపిక చేసే అభ్యర్థులకు కనీస వేతనం ఐదువేల రూపాయలు చెల్లించేటట్లు జిల్లా అధికారులు కృషి చేయాలని ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

# సిఎం, చిరంజీవి ప్రచారంతో పోలంరెడ్డి శిబిరంలో హుషారు!

● ప్రసన్నకు ఓటు ఎలా వేస్తారు? : సిఎం

● అభివృద్ధి కాంగ్రెస్‌తోనే సాధ్యం : చిరంజీవి

కాంగ్రెస్‌పార్టీని గద్దెదించేందుకు జగన్, చంద్రబాబునాయుడు కుమ్మక్కైనారని ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి విమర్శించారు. కోవూరు ఉప ఎన్నికల ప్రచారంలో భాగంగా 9వ తేది నార్తురాజుపాళెంలో జరిగిన బహిరంగ సభలో సిఎం పాల్గొని ప్రసంగించారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి తెలుగుదేశం పార్టీని ప్రథమ శత్రువుగా భావించేవాడని, అలాంటి పార్టీతో చేతులు కలిపి జగన్ అవిశ్వాస తీర్మానం పెట్టాడని, దీనికి ఆయన ప్రజలకు సమాధానం చెప్పాలన్నారు. తెలుగుదేశం పార్టీ తరపున ఎమ్మెల్యేగా గెలిచిన ప్రసన్నకుమార్‌రెడ్డి కాంగ్రెస్‌పార్టీలోకి తర్వాత వైఎస్‌ఆర్ కాంగ్రెస్‌లోకి జంప్ అయ్యారని, ఇలాంటి వారిని అడ్డుకొనేందుకు పార్టీ ఫిరాయింపుల నిరోధక చట్టాన్ని దేశంలో తీసుకరావడం జరిగిందన్నారు. సుదీర్ఘ చరిత్ర కల్గిన కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులరెడ్డిని గెలిపించాలని కోరారు. ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి మాట్లాడుతూ వైఎస్‌ఆర్ పార్టీ అభ్యర్థి ప్రసన్నకుమార్‌రెడ్డి ఓట్లలెక్కింపు లోపల ఏపార్టీ మారుతాడో తెలియదని విమర్శించారు. కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులరెడ్డి మాట్లాడుతూ స్థానికుడిగా ప్రజలకు ఎల్లవేళలా అందుబాటులో వుంటానని, అభివృద్ధి జరగాలంటే తనను ఆశీర్వదించి గెలిపించాని కోరారు. శాసనమండలి సభ్యుడు వాకాటి నారాయణరెడ్డి అధ్యక్షతన జరిగిన ఈ సభలో కేంద్రమంత్రి పనబాక లక్ష్మి, పార్లమెంటు సభ్యులు చింతా మోహన్, మాగుంట శ్రీనివాసులరెడ్డి, లగడపాటి రాజగోపాల్, మంత్రులు రఘువీరారెడ్డి, పితాని సత్యనారాయణ, మోపిదేవి వెంకటరమణ, ఎమ్మెల్యేలు ఆదాల ప్రభాకర్‌రెడ్డి, ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి, మల్లాది విష్ణు, మాజీ మంత్రి నేదురుమల్లి రాజ్యలక్ష్మి, మాదాల జానకిరామ్, సివి శేషారెడ్డి, విష్ణువర్ధన్‌రెడ్డి, కంభం విజయరామిరెడ్డి తదితరులు పాల్గొన్నారు.



ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా వ్యవహరించి నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి కోవూరు ఓటర్లను అవమానించారని కాంగ్రెస్ పార్టీ నేత, సినీ హీరో చిరంజీవి విమర్శించారు. ఉప ఎన్నికల ప్రచారానికి వచ్చిన ఆయన మార్చి 12, 13 తేదీలలో రెండురోజులపాటు కోవూరు నియోజకర్గంలో పర్యటించారు. మొదటిరోజు ఇందుకూరుపేట మండలంలో ప్రచారాన్ని ప్రారంభించి బుచ్చిరెడ్డిపాళెం, కొడవలూరు, విడవలూరులో తిరిగారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ తెలుగుదేశం పార్టీ తరపున పోటీ చేసిన ప్రసన్నకుమార్‌రెడ్డిని ప్రజలు ఓట్లు వేసి గెలిపిస్తే ఆయన నియోజకవర్గ అభివృద్ధిని ప్రక్కనపెట్టి పార్టీలు మారడమే పనిగా పెట్టుకున్నారని విమర్శించారు. ఉప ఎన్నికలు రావడానికి కారణం ప్రసన్న స్వార్థమేన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మరణించినపుడు ఆయన శవాన్ని ఇంటికి తీసుకొని రాకమునుపే కుమారుడు జగన్ ముఖ్యమంత్రి కావాలని దురాశతో ఎమ్మెల్యేల వద్ద సంతకాలు చేయించిన దారుణమైన వ్యక్తన్నారు. మరోవైపు చంద్రబాబునాయుడు ముఖ్యమంత్రి కావాలని పగటి కలలు కంటున్నాడని, గతంలో ఉచిత విద్యుత్‌ను ఎద్దేవా చేసిన ఆయన ఇప్పుడు తగదునమ్మా అంటూ రైతుల పట్ల కపట ప్రేమ ప్రదర్శిస్తున్నాడని దుయ్యబట్టారు. వీరిరువురు కుమ్మక్కై ప్రభుత్వాన్ని పడగొట్టాలనుకొంటే తాము కాంగ్రెస్‌పార్టీకి మద్దతు ఇచ్చి ప్రభుత్వాన్ని నిలబెట్టామని గుర్తు చేశారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఎన్నో సంక్షేమ కార్యక్రమాలు అమలు చేస్తున్నాడని ప్రశంసించారు. కోవూరు నియోజకవర్గం అభివృద్ధి జరగాలంటే పోలంరెడ్డి శ్రీనివాసులరెడ్డిని గెలిపించాలని కోరారు. సిఎం, చిరంజీవి ప్రచారంతో పోలంరెడ్డి శిబిరంలో హర్షాతిరేకాలు వెల్లి విరుస్తున్నాయి. చివరి దశ ప్రచారంలో దూసుకెళ్లేందుకు ఈ పర్యటనలు సహకరించాయి.


నార్తురాజుపాళెం సభలో పోలంరెడ్డిని గెలిపించమంటున్న సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి.


కొడవలూరులో పోలంరెడ్డికి మద్దతుగా ప్రచారం చేస్తున్న చిరంజీవి.


కోవూరు నియోజకవర్గ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డికి మద్దతుగా స్వగ్రామం యల్లాయపాళెంలో ప్రచారం చేస్తున్న మాజీమంత్రి నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ. ప్రక్కన పందిళ్లపల్లి అరుణమ్మ. ఉడతా వెంకట్రావ్, రఘు.

# కోవూరు ఓటర్ల తీర్పు

16వ పేజీ కొరవ

ముసురుకొని వున్నారు. ఎట్లయినా గెలవాలనే పంతంతో ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి కోట్లాది రూపాయలడిగిందే తడవుగా అందజేస్తున్నాడు. కానీ ఎన్నికలలో కాంగ్రెస్ పరిస్థితి పక్షవాతం రోగి చందంగా వుంది. ఇప్పటి అంచనాల ప్రకారం ఫలితాలలో కాంగ్రెస్‌కు మూడవస్థానం తప్పేట్లు లేదు. కర్రలు పెట్టి లేపినా లేవలేని స్థితిలో వుంది. ఏమిటి దీనికి కారణం? ఎక్కడుంది లోపం? ప్రజలలో నిజంగానే కాంగ్రెస్ పట్ల అంత విరక్తి కల్గిందని భావించడం పొరపాటు. ఇంతకంటే ఉధృతమైన రాజకీయ ప్రభంజనంలో కూడా కాంగ్రెస్‌కు ప్రతి నియోజకవర్గంలో సాంప్రదాయ ఓటు బ్యాంకు ఒకటి వుంటుందని రుజువైంది. ఇప్పుడు అది అదృశ్యమైపోయే పరిస్థితి ఏర్పడడానికి కాంగ్రెస్ నేతల అవ్యక్త వైఖరి కారణమని చెప్పక తప్పదు. గత రెండేళ్లుగా కాంగ్రెస్ అభ్యర్థి పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి మీద అకారణ కక్షతో కాంగ్రెస్ పార్టీని చిందవందర చేశాడు మంత్రి ఆనం రామనారాయణరెడ్డి. కార్యకర్తలలో తీవ్రమైన గందరగోళం సృష్టించాడు. దాని ఫలితం ఇప్పుడు కళ్లకు కదుతున్నది. కాంగ్రెస్‌కు వున్న ఓట్లు కూడా వేయించుకోలేని హీనస్థితికి చేరుకొన్నది కాంగ్రెస్ పార్టీ.

## డబ్బు వెదజల్లుతున్నారు

ఏ ఎన్నికనైనా ప్రభావితం చేసే మరొక ప్రధాన అంశం డబ్బు. కోవూరులోనూ ధనం ధారాపాతంగా ప్రవహిస్తున్నది. ముగ్గురూ పోటీలు పడి మరీ డబ్బు వెదజల్లుతున్నారు. ప్రచారం స్థాయిలో, డబ్బు విషయంలో అందరికంటే ఒక అడుగు ముందున్నది వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ. గ్రామస్థాయి నేతల జేబులు పొర్లేట్లు కాసులు ఇచ్చారు వారు. త్రాగిన వాడికి త్రాగినంత మందు పోశారు. తెలుగుదేశం పార్టీ కూడా వారికి ధీటుగా ప్రచారం, వ్యయం చేసింది. కాంగ్రెస్ మాత్రం చివరి వారం వరకు మీన మేషాలు లెక్కపెట్టింది. ఇప్పుడు ఓటుకు నోటు ఇచ్చే కార్యక్రమంలో కూడా జగన్ పార్టీ ముందు మిగిలింది. మంగళ, బుధ వారాలలోనే వారు ఓటుకు రెండు వందల రూపాయల లెక్కన పంపకం చేశారు. చాలా పకడ్బందీగా జరిగిందీ పంపిణీ. ఇంట్లో ఎన్ని ఓట్లు వున్నాయో ముందుగానే సమాచారం తీసుకొని ఓటరు జాబితా ప్రకారం ఎన్ని ఓట్లు ఒక ఇంట్లో వుంటే అన్ని రెండు వందలు, ఓటరు స్లిప్‌తో జత చేసి ఇచ్చేశారు. తెలుగుదేశం పార్టీ ఓటుకు ఐదు వందల వరకు ఇస్తుందనే ప్రచారం వుంది. కాంగ్రెస్ అధికార పార్టీ కదా, ఓటుకు వెయ్యి వరకు ఇస్తుందని ఆశ పడుతున్నారు ఓటర్లు. ఎన్నికల సమయంలో ఓటుకు నోటు ఇవ్వడం ఒక ఆనవాయితీ అయిపోయింది. అయితే ఎక్కడో ఒకటి రెండు సందర్భాలలో తప్ప, నోటు తీసుకొన్న వారు ఆ కృతజ్ఞతతో ఓటు చేసిన దాఖలా లేదు. నోటు దారి నోటుదే, ఓటు దారి ఓటుదే.

## కులాల సమీకరణ

ఈ ఎన్నికలలో పెత్తందారులపై పేదల తిరుగుబాటు అన్న సామాజిక మార్పుకు సంకేతం కులాల వారీగా చీలిపోతున్న ఓటర్ల మనోభావాలు. పార్టీలతో నిమిత్తం లేకుండా రెడ్డి కులస్తులందరూ జగన్ జిందాబాద్ అంటున్నారు. సహజంగానే కమ్మ కులం పచ్చ జెండా పట్టుకొంటున్నది. దళితులలో మాల, మాదిగల మధ్య తేడా కన్పిస్తున్నది. వెనుకబడిన తరగతులలో ఒక్క యాదవులు తప్ప తతిమా కులాలలో తెలుగుదేశం అనుకూలత వ్యక్తమౌతున్నది. గిరిజనులలో జగన్ గాలి కన్పించడం లేదు. పట్టపు కాపులలో కాంగ్రెస్ అదృశ్యమైపోయింది. జగన్, టిడిపిల మధ్య వూగిసలాడుతున్నారు వారు. చిరంజీవి ప్రభావం కూడా కన్పించడం లేదు.

## కమ్యూనిస్టుల సహజ మరణం

ఈ ఎన్నికలలో నిర్ధారణ కానున్న మరొక నిజం – కమ్యూనిస్టుల సహజ మరణం. కోవూరు నియోజకవర్గం అనాదిగా వారికి పట్టుకొమ్మ. దామరమడుగు, యల్లాయపాళెం, పెనుబల్లి, అలగానిపాడు, లేగుంటపాడు, విడవలూరు వంటి గ్రామాలలో కమ్యూనిస్టులు బలంగా వుండేవారు. ప్రతి ఎన్నికలో వారికి 12 నుంచి 14వేల వరకు ఓట్లు వచ్చేవి. కానీ ఈసారి ఆ సంఖ్య అంకెగా మారిపోతున్నది. మూడునాలుగు వేలకు మించి ఓట్లు రాకపోవచ్చు. జిల్లాలో అంతరించిపోయిన పార్టీలలో కమ్యూనిస్టులూ ఒకరని చరిత్ర పుస్తకాలలో చదువుకొనే అవకాశం కల్పిస్తున్నది కోవూరు ఎన్నిక.

## వూహలకు భిన్నం

ఒకటి మాత్రం నిజం. ఎన్నికల ఫలితం మాత్రం వూహలకు అనుగుణంగా వుండదు. ఎంతో కొంత భిన్నం తప్పదు. ఆ అభిప్రాయం వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కట్టుకొంటున్న మెజార్టీ గాలి మేడలలో కావచ్చు లేదంటే తెలుగుదేశం స్థాయి కావచ్చు. ఒకటికి నాలుగు పార్టీలు పోటీలో వుండడం కులాలలో వస్తున్న సమీకరణలు, కాంగ్రెస్ వాదులు చివరి నిముషంలో తెలుగుదేశాన్ని బలపరచే అవకాశం, వైఎస్ఆర్ కాంగ్రెస్ అభ్యర్థి ప్రసన్నకుమార్‌రెడ్డి మీద వున్న వ్యతిరేకత, డబ్బు పంపకాల వల్ల వూహలకు, ఫలితానికి స్పష్టమైన తేడా కన్పించే అవకాశం వుంది. జగన్ పార్టీ ఆశించినంత ఏకపక్షంగా ఎన్నిక జరగడం లేదని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్క రకంగా వుంది పరిస్థితి. 20వేలకు పైగా ఓట్లున్న కోవూరు పంచాయితీలో పైకి వైఎస్ఆర్ కాంగ్రెస్ ఉధృతి బాగా కన్పిస్తున్నది. కానీ గణనీయమైన సంఖ్యలో వున్న బలిజ ఓటర్లు కాంగ్రెస్‌ను బలపరచే సూచనలు కన్పిస్తున్నాయి. వెనుకబడిన తరగతులలో తెలుగుదేశం అనుకూలత వ్యక్తమౌతున్నది. ఇవి రెండూ నిజమైతే వైఎస్ఆర్ కాంగ్రెస్ సాధించే ఆధిక్యత ఆశించిన దానిలో సగం కూడా వుండదు. లేగుంటపాడు, పడుగుపాడు, పాటూరు, చెర్లోపాళెం, రాజుపాళెం, విడవలూరు, ముదివర్తి వంటి గ్రామాలలో వైఎస్ఆర్ కాంగ్రెస్ ప్రభ దేదీప్యమానంగా వెలుగొందుతూ వుంది. కానీ ఇదే మండలాలకు చెందిన వేగూరు, ఇనమడుగు, పోతిరెడ్డిపాలెం, గండవరం, రామతీర్థం, వూటుకూరు వంటి గ్రామాలలో తెలుగుదేశం ఆధిక్యత స్పష్టంగా కన్పిస్తున్నది. ఇందుకూరుపేట మండలం మొత్తం మీద కూడా పరిస్థితి ఇంతే గందరగోళంగా వుంది. కొన్ని గ్రామాలలో వైఎస్ఆర్ కాంగ్రెస్ గాలి ఉధృతంగా వీస్తుంటే, మరికొన్నింటిలో తెలుగుదేశం పోటాపోటీగా వుంది. ఈ నేపథ్యంలో 30 నుంచి 50 వేల ఓట్ల మెజార్టీ అంచనాలు నిజమౌతాయా అన్నది అనుమానం.

# నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

సూత్రాన్ని, చెన్నైకి చెందిన దామోదరనాయుడు 63 కిలోల 616 గ్రాములతో చేయించిన వెండిపీటను అమ్మవారికి అమరుస్తారని ఇఓ ఆవుల వెంకటేశ్వర్లు చెప్పారు.

## వేదవ్యాస స్కూల్ విద్యార్థిని ప్రతిభ

గాయత్రి పరివార్ రాష్ట్రస్థాయిలో నిర్వహించిన భారతీయ జ్ఞానపరీక్షలో నెల్లూరు మాగుంటలేఅవుట్‌లోని వేదవ్యాస స్కూల్‌లో 7వ తరగతి చదివే బి.సుమ ప్రథమ బహుమతి గెలుచుకొంది. 10వ తేదీ హైదరాబాద్‌లోని పిఎన్ఎం హైస్కూల్ ఆవరణలో జరిగిన బహుమతి ప్రదాన సభలో రంగారెడ్డి జిల్లా కలెక్టర్ వి.శేషాద్రి సుమకు ఈ బహుమతిని అందించారు. నెల్లూరు కస్తూరిదేవి ఆడిటోరియంలో జరిగిన ప్రధానోపాధ్యాయుల సభలో డిఇఓ మువ్వా రామలింగం సుమకు పుష్పగుచ్ఛం ఇచ్చి అభినందించారు.

## ఉగాది పురస్కారాలు

విక్రమ సింహపురి సంగీత సభ నేతృత్వంలో నందననామ తెలుగు ఉగాది సంబరాలు 23వ తేదీ టౌన్‌హాల్‌లో జరుగుతాయి. స్వయంపాకుల శ్రీనివాసులు పంచాంగ శ్రవణం అనంతరం గ్రోసు గోపాలయ్య, కె.వి.రమణయ్య, ఎం.ఆర్.ప్రసాద్, ఎ.లక్ష్మీప్రసన్న, డాక్టర్ సుందరేశ్వరరావు, సురభి గాయత్రిలకు ఉగాది పురస్కారాలను జంట ఎమ్మెల్యేలు ఆనం వివేకానందరెడ్డి, ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి అందిస్తారని ఈ కార్యక్రమానికి అందరూ విచ్చేసి జయప్రదం చేయమంటున్నారు సంగీత సభ అధ్యక్ష, కార్యదర్శులు వాకాటి విజయకుమార్‌రెడ్డి, బి.వి.నరసింహం.

## బందోబస్తుకు మూడువేల మంది పోలీసులు

కోవూరులో ఉప ఎన్నికల బందోబస్తుకు మూడువేల మంది పోలీసులు 13వ తేదీ సాయంత్రం బయలుదేరి వెళ్లారు. నియోజకవర్గంలో కోవూరు మండలాన్ని నెల్లూరు ఎఎస్పీ చంద్రశేఖర్ పర్యవేక్షిస్తారు. కొడవలూరు మండలానికి కావలి డిఎస్పీ ఇందిర, బుచ్చి మండలానికి ఆత్మకూరు డిఎస్పీ రవీంద్ర నాయక్, విడవలూరు మండలానికి గూడూరు డిఎస్పీ సురేష్‌కుమార్, ఇందు కూరుపేట మండలానికి నెల్లూరు నగర ఓఎస్డీ నరసింహకిషోర్ ఇన్‌ఛార్జ్‌లుగా వ్యవహరిస్తారు. పోలింగ్ జరిగే రోజు 35 రూట్లలో పర్యవేక్షణకు 35 మంది సిఐల నేపథ్యంలో పది మంది చొప్పున ఉండే స్పెషల్ పార్టీలు ఏర్పాటు చేశారు. పోలింగ్ కేంద్రాల వద్ద ఎస్ఐల తోపాటు పోలీసులుంటారు. దీనికోసం శిక్షణ పొందుతున్న ఎస్ఐలను, హెడ్‌కానిస్టేబుళ్లను వినియోగిస్తున్నట్లు గుంటూరు రేంజ్ ఐజి హరీష్‌కుమార్ గుప్తా చెప్పారు.

## సిద్ధ సమాధి యోగ శిక్షణా తరగతులు

బెంగుళూరులోని ఋషి సంస్కృతి విద్యా కేంద్రం నేతృత్వంలో సిద్ధ సమాధి యోగ శిక్షణా తరగతులు 18వ తేదీ వేదాయపాళెంలోని ఎం.వి.ఎస్ కళ్యాణ మండపంలో ఉచిత పరిచయ కార్యక్రమంతో ప్రారంభమవుతాయి. 15 రోజుల పాటు జరిగే ఈ తరగతుల్లో శిక్షణ తీసుకొంటే ఎన్నో ప్రయోజనాలున్నాయని ఆచార్య శ్రీనివాస్‌జీ చెబుతున్నారు. ఇతర వివరాలను 80085 47957 నెంబరుకు ఫోన్ చేసి తెలుసుకోవచ్చు.

## జనవాణి

2వ పేజీ కొరవ

పురంకు చెందిన యువతి హసీనా, ఆమె బిడ్డకు హెచ్ఐవి సోకింది. ఆమెకు రెండు లక్షల రూపాయల చెక్కు, ఇందిరమ్మ గృహం ఇచ్చి సరిపెట్టాలని జిల్లా అధికారులు తలపోయడం దారుణం. హెచ్ఐవి సోకిన మూలంగా పనిచేయ లేని స్థితిలో ఉన్న హసీనాకు పెద్ద మొత్తంలో పరిహారం ఇవ్వడంతోపాటు ఆమె బిడ్డను కాపాడవలసిన బాధ్యత కూడా ప్రభుత్వంపై ఉంది.

కె.హేమ — నెల్లూరు

## పదరంగం -6

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | | 2 | 3 | | 4 | | | 5 |
| | | | | 6 | | | | 7 | 8 | |
| | | 9 | | | | | 10 | | | |
| | | | | | | 11 | | 12 | | |
| 13 | 14 | | | | 15 | | 16 | | 17 | |
| | | | 18 | | | | 19 | | | |
| | 20 | | | | | 21 | | | | 22 |
| | | | | | 23 | | | | | |
| 24 | | | 25 | | | 26 | | 27 | | |
| 28 | | 29 | | | 30 | | | 31 | | |
| | | | | 32 | | | | | | 33 |

**అడ్డం**

1. పొందలేనిది, అని అర్థం (6)
6. భూమి (2)
8. వరుస తప్పిన పవర్ (4)
9. మసాలా వంటకం దినుసు (వేరు) (3)
10. మహర్షులకు గల దృష్టి (4)
12. సార్ వాడు (3)
13. యాచకుడు (3)
15. వాకిలి (3)
17. వండడం – అసమాపకం (2)
19. మార్చ్ ఫాస్ట్ (3)
20. నిలువు 2 వ్యక్తే (4)
21. మీనం (2)
22. అటు నుంచి సప్తం, సంవత్సరం కూడా (2)
23. వాంఛ (3)
25. వేదాంతం (2)
26. ఎలుక గారి నివాసం (3)
28. స్త్రీ (3)
30. అటు నుంచి దెబ్బ (2)
31. నిలువు 29కి వ్యతిరేకం (2)
32. యవ్వనం (3)
33. ఇంగ్లీషులో – వెళ్ళు (1)

**నిలువు**

1. భార కేంద్ర స్థానం (5)
2. కుచేలుడు (4)
3. సచివుడు (2)
4. గుడి కకావిక లైంది (3)
5. ధర్మరాజు (5)
7. కవితల మాలిక చివర తెగింది (3)
8. లక్కీ ఫెలో (6)
9. వీలైన ప్రదేశం (3)
11. కుడ్యం (2)
14. క్షుర కర్మ చేయువాడు (4)
15. శంకువులాంటిదే (2)
16. నవ్వులు (5)
18. వాటం (2)
21. జాయినింగ్ (3)
22. నూలు కండెలు (3)
24. మత్స్యకారుడు (3)
27. రోజా పువ్వు (3)
29. లాస్ (2)
30. వృక్ష మూలం (2)

**సమాధానాలు**

## పదరంగం -5

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 సం | క | ల్ప | సి | ద్ధి | | 2 క | | 3 త | రు | ణం |
| క | | | | బు | | జ | | రా | | ర |
| 4 ట | ము | 5 కు | | ద్ధి | | 6 రా | రా | జు | | 7 చ |
| ము | | మా | | 8 సి | 9 నా | రే | | | 10 మ | |
| | | ర | | | స్తి | | | 11 సూ | రీ | డు |
| | 12 ఆ | స్వా | దం | | కు | | | 13 దం | చి | |
| 14 బా | దా | మి | | 15 క | డు | 16 పు | | టు | క | 17 ఇ |
| | యం | | 18 ఏ | | | నః | | రా | | ర |
| 19 సా | | 20 ప | రు | వ | ము | | | యి | స్రా | 21 వై |
| 22 కా | మి | | వా | | | 23 తా | | | | |
| రం | | 24 పో | క | లు | | 25 వి | శ్వా | మి | త్రు | డు |

# సంక్షిప్త సింహపురి

## ముస్లింలకు రిజర్వేషన్ ఇచ్చింది కాంగ్రెస్సే!

ముస్లింలకు ఐదు శాతం రిజర్వేషన్లు కల్పిస్తామన్న వాగ్దానాన్ని 2004 ఫిబ్రవరి 13తేది నెల్లూరు కస్తూరి దేవి హైస్కూల్ ప్రాంగణంలో జరిగిన రాష్ట్ర మైనార్టీ సదస్సులో గులాంనబీ ఆజాద్ చేశారని, దాన్ని నిలబెట్టుకొన్నారని జిల్లా వక్ఫ్ బోర్డు అధ్యక్షుడు ఎస్.ఎం.ఏ.హుస్సేనీ 10తేది ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో గుర్తు చేశారు. స్వర్గీయ రాజశేఖర్‌రెడ్డి ముస్లింలకు 4.5శాతం రిజర్వేషన్లు కల్పించేలా ఉత్తర్వులిచ్చినా ఈ వ్యవహారం కోర్టులో నలుగుతోందని కాంగ్రెస్ అధిష్టానం ఇది అమలయ్యేలా త్వరలో చూస్తుందన్నారు. సచార్, గోపాల్‌సింగ్ కమిషన్ రిపోర్టుల ఆధారంగా ముస్లింల అభివృద్ధికి కాంగ్రెస్ పార్టీ ప్రణాళికలు రూపొందించినట్లు హుస్సేనీ చెబుతూ కొసరుగా కోవూరులో పార్టీ అభ్యర్థిని గెలిపించమన్నారు.

## వివేకాకు మంచి బుద్ధిని ప్రసాదించు మహాత్మా...



నెల్లూరు రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి ఓట్ల కోసం చేసే ప్రయత్నాలలో హిందువులు, క్రిస్టియన్ల మనోభావాలు దెబ్బతినేలా వ్యవహరిస్తున్నారని, ఆయనకు మంచి బుద్ధిని ప్రసాదించేలా చూడమని బిజెపి నేతలు ట్రంకురోడ్డులోని మహాత్మాగాంధీ విగ్రహానికి వినతిపత్రమిచ్చారు. విఆర్ కాలేజి కొనుక్కొన్న వైఎంసిఏ మైదానంలో కట్టిన కొత్త భవనాన్ని పరిశీలించేందుకు ఎఐసిటిఇ సభ్యులు నగరానికి వచ్చారు. వీరికి వినతి పత్రం ఇవ్వను వెళ్లిన ఎబివిపి, విహెచ్‌పి నేతలపై కళాశాల కరస్పాండెంట్‌గా వ్యవహరిస్తున్న ఆనం వివేకానందరెడ్డి దౌర్జన్యకర రీతిలో ప్రవర్తించారు. దేవాదాయశాఖ నోటిఫై చేసిన విఆర్ విద్యా సంస్థల ప్రాంగణంలో బాలయేసు బొమ్మ పెట్టడం తప్పని విద్యార్థి సంఘ నేతలు చెప్పగా, ఎమ్మెల్యే నాయిష్టం వచ్చినట్లు చేస్తాను. రంగనాథస్వామి దేవాలయంలో కూడా ఏసుక్రీస్తు బొమ్మ పెడతాను మీ చేతనైంది చేసుకోండని చెప్పడం హిందువుల మనసును గాయపరచిందన్నారు. హిందు దేవాలయంలో క్రీస్తు విగ్రహం పెడతాననడం క్రిస్టియన్లను అవమానించడమేనన్నారు. ఆనం వారి నిజస్వరూపాన్ని ప్రజలు గుర్తించేందుకు జాతిపిత విగ్రహానికి వినతిపత్రం యిస్తున్నాము. విఆర్‌సి విద్యాసంస్థల ఆస్తులు, నిధుల దుర్వినియోగంపై సిబిఐ విచారణ జరపాలని బిజెపి నేతలు డిమాండ్ చేశారు.

## డాక్టర్ జయప్రదకు పురస్కారం



నెల్లూరు డాక్టర్ పెళ్లకూరు జయప్రద వ్రాసిన కందుకూరి నవలకు కడప విద్యా సాంస్కృతిక సేవా సంస్థ పురస్కారాన్ని ప్రకటించింది. దీన్ని హైకోర్టు న్యాయమూర్తి బి.చంద్రకుమార్ దంపతులు కడప హరిత ఎసి ఆడిటోరియంలో ఇటీవల జరిపిన సభలో డాక్టర్ జయప్రదకు అందించారు. ఈ కార్యక్రమంలో అలపర్తి పిచ్చయ్య చౌదరి, డాక్టర్ మల్లెమాల వేణుగోపాల్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## కేబుల్ ఆపరేటర్స్ సాయం



జయలలితనగర్‌లో జరిగిన అగ్ని ప్రమాదంలో ఇళ్లు తగులబడిపోయి కట్టుబట్టలతో మిగిలిన 23 కుటుంబాలకు పినాకిని కేబుల్ ఆపరేటర్స్ వెల్ఫేర్ అసోసియేషన్ తమ వంతు సహకారం అందించింది. ఒక్కో కుటుంబానికి పది కిలోల బియ్యం, వంట పాత్రలను అసోసియేషన్ అధ్యక్షుడు జమీర్, కార్యదర్శి రమణారావు స్వయంగా వెళ్లి పంచారు. ఈ కార్యక్రమంలో నన్నేసాహెబ్, అహ్మద్ బాషా, ఖాజామొహిద్దీన్, క్రిష్ణ, అమీర్‌జాన్, ప్రసాద్, కళ్యాణ్ తదితరులు పాల్గొన్నారు.

## స్వర్ణంతో రంగడి రథం



పసిడితో అద్భుత నమూనాలు రూపొందించే నెల్లూరు కొరడావీధికి చెందిన స్వర్ణకారుడు ముసవ్వీర్ రంగడి బ్రహ్మోత్సవాలను పురస్కరించుకొని సూక్ష్మ స్వర్ణ రథాన్ని తయారు చేశాడు. కేవలం ఒక గ్రాము 180 మిల్లీ గ్రాముల బంగారాన్ని వినియోగించి ఒక అంగుళం పొడవు, అర అంగుళం వెడల్పుతో రూపొందించిన ఈ రథాన్ని కేవలం ఆరు గంటల్లోనే తయారు చేయడం విశేషం. గతంలో ముసవ్వీర్ రూపొందించిన స్వర్ణ జాతీయ గీతం నమూనా ఇండియా బుక్ ఆఫ్ రికార్డ్సులో నమోదయ్యింది.



## రైతు లోకం: రెల్లురాల్చు పురుగు - నివారణ చర్యలు!

జిల్లాలోని డెల్టా ప్రాంతంలో వరి పైరు కొంతభాగం కోత దశకు చేరుకోనుంది. ఈ నేపథ్యంలో వివిధ రకాల పురుగులు వెన్నులు కొరికి పంటకు నష్టం కలిగించే అవకాశం వుంది. వాటి నివారణకు కోసం వ్యవసాయ శాస్త్రవేత్తలు, వ్యవసాయాధికారుల నుంచి సూచనలు, సలహాలు తీసుకొని క్రిమి సంహారక మందులు వాడాల్సి వుంటుంది.

### రెల్లురాల్చు పురుగు:

గొంగళి పురుగులు గింజ గట్టిపడే దశలో వెన్నులు కొరికి నష్టాన్ని కలుగజేస్తాయి. రాత్రి పూట మాత్రమే ఇవి పంటకు హాని చేస్తాయి.

### నివారణ:

ఈ పురుగు నివారణ కోసం పొలానికి ముందుగా నీరు పెట్టి క్లోరిపైరిఫాస్ 2.5 మిల్లీ లీటర్లు లేక ఎండోసల్ఫాన్ 2.0 మిల్లీలీటర్లను డైక్లోరోవాస్ 1.0 మిల్లీలీటర్లతో ఒక లీటరు నీటికి కలిపి సాయంత్రం వేళల్లో పిచికారి చేయాలి.

### ఆకు నల్లి:

పిల్ల, పెద్ద నల్లి పురుగులు ఆకులను ఆశించి రసాన్ని పీల్చి వేయడం వల్ల ఆకులు పాలిపోయి పైరు ఎండిపోయినట్లు కనిపిస్తుంది.

### నివారణ:

నీటిలో కరిగే గంధకపు పొడి 50 శాతం 3 గ్రాములు లేక డైకోఫాల్ 5 మిల్లీలీటర్ల చొప్పున లీటరు నీటిలో కలిపి పిచికారి చేయాలి.

### కంకి నల్లి (నల్లకంకి):

ఇవి కంటికి కనిపించని సూక్ష్మ సాలీడు వర్గానికి చెందిన పురుగులు. ఇవి ఆశించిన ఆకులపై పసుపు వర్ణపు చారలు ఏర్పడి క్రమేపి ఆకు తొడిమెల లోపల, ఆకు ఈనెల్లో వృద్ధి చెందుతాయి. ఆకు అడుగు భాగాన ఈనెల పైన, ఆకు తొడిమెలపై నల్లటి మచ్చలు ఏర్పడతాయి. గింజలపై నల్లటి మచ్చలు ఏర్పడి పాలుపోసుకోక తాలు గింజలుగా అవుతాయి. బెట్ట పరిస్థితుల్లో పురుగు వుధృతి ఎక్కువగా వుంటుంది.

డాక్టర్ ఎం.రవీంద్రకుమార్ రెడ్డి,
ప్రధాన శాస్త్రవేత్త & కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

### నివారణ:

ఈ పురుగు లక్షణాలు గుర్తించిన వెంటనే 15 రోజుల వ్యవధిలో రెండుసార్లు ప్రొఫెనోఫాస్ రెండు మిల్లీలీటర్లు లేక డైకోఫాల్ ఐదు మిల్లీలీటర్లను లీటరు నీటిలో కలిపి పిచికారి చేయాలి.



Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/12-14
జమీన్‌రైతు

# కోవూరు ఓటర్ల తీర్పు ఎప్పుడూ విలక్షణమే!

## కోవూరులో ఎవరు గెలిచినా కల్లోలమే

మొదటి పేజీ కొరవ

పడుతూ వుంటాయి. సర్వే నివేదిక ఒకరకంగా వుంటే ఫలితం వేరొక రకంగా వుంటుంది. అందు వల్లనే ఈ దశలో కూడా కోవూరు ఉప ఎన్నిక ఫలితాన్ని అంచనా కట్టి పాఠకులకు చెప్పడానికి చేతులు ఆడడం లేదు. చెప్పే అంచనా ఎంత శాతం ఖచ్చితంగా వుంటుందో అన్న సందేహమే అందుకు కారణం.

అయితే ఒకటి మాత్రం నిజం. కోవూరు ఉప ఎన్నికలో ఎవరు గెలిచినా రాష్ట్ర రాజకీయాలలో కల్లోలం తప్పదు. అది మాత్రం నిస్సందేహంగా చెప్పవచ్చు. వైఎస్‌జగన్ పార్టీ, వారు వూహించినట్లు 30 నుంచి 50 వేల మెజార్టీతో గెలిస్తే కిరణ్ సర్కారు కుర్చీ క్రింద కీళ్లు సడలిపోతాయి. ఏ కారణం వల్ల నైనా ఆ పార్టీ ఓడిపోయినా, అధమపక్షం మెజార్టీ పది వేల లోపుకు దిగజారినా జగన్ రాజకీయ భవిష్యత్తు అంధకారమై పోతుంది. మెజార్టీ ఎంత అయినా, రెండవ స్థానంలో తెలుగుదేశం వస్తే, చంద్రబాబుకు కొత్త వూపిరి వస్తుంది. కనుమరుగై పోతున్నదన్న ప్రచారం నుంచి బయటపడుతుంది. కాంగ్రెస్‌కు రెండవ స్థానం దక్కితే, వచ్చే ఎన్నికలలో తమదే మొదటి స్థానమని మేకపోతు గాంభీర్యం ప్రదర్శించే అవకాశం కిరణ్‌కుమార్‌రెడ్డికి దక్కుతుంది. పరిశీలకుల వూహ ప్రకారం కాంగ్రెస్ మూడవ స్థానానికి పతనమైతే, ఇక ఈ రాష్ట్రంలో కాంగ్రెస్ పరిస్థితి తమిళనాడు తరహాకు మారిపోతుంది.



నార్తురాజుపాళెం రోడ్డు షోలో మాట్లాడుతున్న చంద్రబాబు నాయుడు.

ఒక్క అసెంబ్లీ స్థానం ఉప ఎన్నిక, రాష్ట్ర రాజకీయాలను ఇంతగా కల్లోలపరచే స్థితిలో వుండడం అపూర్వం. కానీ అది నిజం. రాష్ట్ర రాజకీయ చరిత్రలో ఈ ఉప ఎన్నిక ఒక మైలు రాయిగా నిలబడి పోవడం ఖాయం.

## కోట్లలో పందాలు

అయితే గెలిచే వారెవరు? విచిత్రంగా ఈసారి గెలుపు మీద పందాలు కాసే వారు లేరు. కానీ మెజార్టీ మీద కోట్ల రూపాయలు బెట్టింగ్ కడుతున్నారు. వైఎస్.జగన్ అభ్యర్థి ప్రసన్నకుమార్‌రెడ్డికి 20 వేల మెజార్టీ వస్తుందనే వాదనపై గత వారమంతా పందాలు నడిచాయి. ఇప్పుడు ముప్పై, నలభై వేలకు కూడా పందానికి సై అంటూ పిలుపులు వస్తున్నాయి. ఈ పందాలు కోవూరుకో, నెల్లూరుకో పరిమితం కావడం లేదు. హైదరాబాదు, మద్రాసు వంటి నగరాలలో వున్నత స్థాయిలోని వ్యక్తులు కూడా ఈ జూదంలో కోట్లాది రూపాయలు ఒడ్డుతున్నారు. మెజార్టీతో పాటుగా ద్వితీయ స్థానం ఎవరిది అనే అంశం మీద కూడా బెట్టింగ్ నడుస్తున్నది.

## కోవూరు ఓటర్లు గొర్రెలా?

మెజార్టీ మీద ఈ స్థాయిలో పందాలకు కారణం – కడప లోక్‌సభ ఉప ఎన్నికలలో వైఎస్.జగన్‌కు వచ్చిన అనూహిత ఆధిక్యత. ఒక్కొక్క శాసనసభ నియోజక వర్గంలో 70వేల నుంచి 90 వేల వరకు మెజార్టీ వచ్చింది ఆయనకప్పుడు. దాన్ని చూసి ఇక్కడ కూడా ఆ చరిత్రే పునరావృతం అవుతుందనే భావనతో, ధీమాలో మెజార్టీ మీద పందాలకు సిద్ధపడుతున్నారు. అయితే కోవూరు ప్రజలు కడప ఓటర్లలాగా గొర్రెలా? మూకుమ్మడిగా, గొర్రెదాటుగా ఒకే గుర్తు మీద ముద్ర వేసే ఆలోచనా రహితులా? వేయదగిన ప్రశ్నే ఇది. గత ఎన్నికల వివరాలు చూస్తే కోవూరు జనం గొర్రెదాటుకు లోబడరనే అన్పిస్తున్నది. 1983లో రాష్ట్ర మంతా ఎన్టీఆర్ ప్రభంజనం ఝంఝూమారుతం వలె వీచినప్పుడు కూడా ఆ పార్టీ అగ్రశ్రేణి నేత నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి కనీసపాటి మెజార్టీతో మాత్రమే ఇక్కడ విజయం సాధించాడు. పక్కనున్న నెల్లూరు, సర్వేపల్లి వంటి నియోజకవర్గాలలో అనామక అభ్యర్థులకు వచ్చినపాటి ఆధిక్యత కూడా ఆయనకు రాలేదు. ఆ దృష్టితో చూసినప్పుడు కోవూరు ఉప ఎన్నిక ఫలితం ఆ స్థాయి ఏకపక్షంగా వుండక పోవచ్చునన్పిస్తున్నది.

## ప్రసన్న మీద కోపమెందుకు?

ఈ ఎన్నికలో ఓటరు నిర్ణయాన్ని ప్రభావితం చేసే అంశాలు ఏమిటి అన్న దానిపై గెలుపు ఓటములు, ఆధిక్యతలు ఆధారపడి వుంటాయి. ప్రధానమైన అంశం వైఎస్.రాజశేఖర్‌రెడ్డి పట్ల వున్న అభిమానం. ఆయన చేసిపోయిన మేళ్లకు కృతజ్ఞత చెల్లించుకోవాలన్న ఆతృత. కానీ అదొక్కటే ఓటరు దృష్టిలో వుందని భావించలేము. ఇతరత్రా చాలా



దామరమడుగు రోడ్డు షోలో మాట్లాడుతున్న వైఎస్.జగన్మోహన్‌రెడ్డి.

అంశాలు కూడా పరిగణనకు వస్తున్నాయని ఒప్పుకోక తప్పదు. వాటిలో ముఖ్యమైనది – జగన్ అభ్యర్థి ప్రసన్నకుమార్‌రెడ్డి మీద వున్న వ్యతిరేకత. ఆయన ఏ తప్పు చేశాడో తెలియదు కానీ, ఏ గ్రామం వెళ్లినా జనం నిలదీస్తున్నారు. నీ ముఖం చూస్తే ఓటు వేయాలన్పించడం లేదు, జగన్ కోసం వేయక తప్పడం లేదనే మాట విన్పిస్తున్నది. నిజంగా ప్రసన్న అంత చేయరాని తప్పులు చేశాడా? డబ్బు తీసుకొని పార్టీ మారాడన్నది ఒక ఆరోపణ. వేల కోట్లు దోచుకొని, సిబిఐ కేసులతో కోర్టుల చుట్టూ తిరుగుతున్న జగన్ చేసిన నేరం కంటే పెద్దదా అది? జగన్ విషయంలో ప్రస్తావనకు రాని రాజకీయ అవినీతి, ప్రసన్నకు మాత్రం ఎందుకు అడ్డం వస్తున్నది? నిజంగా ఓటరు మనసులో ఏమి వుంది? జగన్‌ను తిట్టలేక ఆ నెపం ప్రసన్న మీద తోస్తున్నారా? ఏమో, ఎవరికి తెలుసు?

## పెత్తందారీతనంపై తిరుగుబాటు?

ఈ ఎన్నికను ప్రభావితం చేస్తున్న మరొక ముఖ్య అంశం – జగన్ పక్షంగా గ్రామాలలో పెత్తనం చేసే వారందరూ గుమికూడడం. కాంగ్రెస్, తెలుగుదేశం, వైఎస్ఆర్ కాంగ్రెస్ అన్న తేడాలు మరచిపోయి, పెద్ద రైతులు ఏకత్రాటి మీద జగన్‌పై అభిమానం వ్యక్తం చేస్తున్నారు. ఇంతకాలం వారిననుసరించి, తమ రాజకీయ పంథా నిర్ణయించుకొన్న అనుచరవర్గంలో ఇది ఆగ్రహం తెప్పిస్తున్నది. పెద్దవాళ్లంతా ఒకటి కాగలిగినప్పుడు, చిన్నవాళ్లం మేమెందుకు కాకూడదనే ఆలోచన రేకెత్తుతున్నది. ఒకరకంగా చెప్పాలంటే గ్రామస్థాయిలోని పెత్తందారీ వర్గాల మీద సాధారణ జనం ఒక మోస్తరు తిరుగుబాటుకు సిద్ధపడుతున్నారని చెప్పక తప్పదు. రేపటి ఫలితం మా ఈ అంచనాను నిర్ధారిస్తుందనే నమ్మకం మాకుంది. సమాజంలో వస్తున్న గణనీయమైన మార్పు ఇది.

## తెలుగుదేశం బలం దేనికి సూచన?

ఆ మార్పుకు ఒక బలీయమైన సంకేతం – తెలుగుదేశం పార్టీకి లభిస్తున్న ఆదరణ. గత ఇరవై ఏళ్లుగా కోవూరు నియోజకవర్గంలో తెలుగుదేశం పార్టీ ప్రసన్న చేతిలోనే వుంది. కార్యకర్తలంతా ఆయన అనుచరులే. ఆయనతో పాటుగా అధిక సంఖ్యాకులు వైఎస్ఆర్ కాంగ్రెస్‌కు వలస వెళ్లారు. చాలా గ్రామాలలో తెలుగుదేశం పార్టీకి జెండా కట్టే దిక్కు లేకుండాపోయింది. మరొకప్రక్క రాష్ట్రం మొత్తం మీద తెలుగుదేశం పార్టీ నామమాత్రావశిష్టమై పోయిందని, చంద్రబాబును జనం నమ్మడం లేదనే ప్రచారం ఉధృతంగా వుంది. ఈ నేపథ్యంలో కోవూరు తెలుగుదేశం అభ్యర్థి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి అనాథ వలె మిగిలి పోవాలి. ఈ నియోజకవర్గం వ్యక్తిగతంగా కూడా ఆయనకు కొత్త. కానీ విచిత్రంగా ఈ ఎన్నికలో తెలుగుదేశం పార్టీ అనుకొన్న దానికంటే బలీయమైన స్థాయికి పుంజుకొన్నది. గెలుపు దగ్గరగా వుందనే భావన వ్యాప్తి అయిందంటే ఆ పెరుగుదల ఎంతమేర వుందో అర్థం చేసుకోవచ్చు. చచ్చిందనుకొన్న పార్టీ బ్రతకడమే కాదు, నవ నవలాడే ఉత్సాహం సంతరించుకోవడానికి కారణం చంద్రబాబు గొప్పదనం కాదు. గ్రామాలలో పెత్తందారీ వర్గాల మీద సాధారణ ప్రజలలో వచ్చిన విరక్తి అని చెప్పడం తప్పు కాదు. పెత్తందారులు అక్కున చేర్చుకొన్న పార్టీని తామెందుకు గుడ్డిగా అనుసరించాలనే భావనతోనే జనం తెలుగుదేశం పార్టీని పాడె మీద నుంచి పైకి లేపారని చెప్పడం అతిశయోక్తి కాదు.

## కాంగ్రెస్ పరిస్థితి ఏమిటి?

అధికారంలో వుంది. అధికారదర్పానికి ఆనవాలుగా వెలిగిపోతున్న మంత్రి వున్నాడు. ఆయన వెన్నంటి ఒకరికి ఇద్దరు ఎమ్మెల్యేలున్నారు. ఒక ఎమ్మెల్సీ తోడైనాడు. ప్రతి గ్రామంలో అభివృద్ధి పేరిట మంత్రిగారిచ్చే పనుల కోసం వందలాది మంది గ్రామ నేతలు బెల్లం చుట్టూ ఈగల వలె

కొరవ 14వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com